# శీతా కాలపు మీ విశ్రాంతి కేవలం కొద్ది గంటల దూరంలోనే ఉంది.



భారతదేశంలోని ప్రతీ ప్రాంతం కూడా మీకు వేయి వసంతాల శోభలతో ఆనందాన్ని కలిగిస్తుంది. కొద్ది గంటలలోనే మీరు చేరుకోవచ్చు—విమానం ద్వారా.

## ఉత్తరం

**కాశ్మీర్**: శీతా కాలపు విశ్రాంతి దినాల అపూర్వ అనుభూతికోసం. అనేక మంచు క్రీడలు. శ్రీనగర్ విమానాశ్రయం ప్రక్కనే.

**సిమ్లా**: కొండలలోని ఆనంద నిలయం. అతి దగ్గరలోని విమానాశ్రయం—చండీఘడ్.

**రాజస్థాన్**: ఎండాకాలంలో మీకు సరిగ్గా సరిపడిన ప్రదేశం. జ్ఞాపకాలు వెన్నాడే రాజ ప్రాసాదాలు, కోటలు. జోధ్‌పూర్, జైపూర్, ఉదయపూర్‌లలో విమానాశ్రయాలు.

## దక్షిణం

**కోవళం**: అద్భుతమయిన సముద్ర తీర విశ్రాంతి కేంద్రం. యోగ, ఆయుర్వేద చికిత్స సదుపాయాలు. అతి దగ్గరలోని విమానాశ్రయం—తిరువనంతపురం.

**మహాబలిపురం**: గొప్ప సముద్రతీర దేవాలయాలు. బంగారు కాంతుల ఇసుక తీరాలు, నీలి సముద్రాలు. అతి సమీపంలోని విమానాశ్రయం—మద్రాసు. కవ్‌లాంగ్ బీచ్‌కి కూడా మార్గం.

**కంచీపురం**: 1000 దేవాలయాల నగరం. అందమైన, అద్భుతమైన చేనేత సిల్కు వస్త్రాలకు ప్రసిద్ధి చెందింది. అతి దగ్గరలోని విమానాశ్రయం—మద్రాసు.

## తూర్పు

**కాజిరంగ**: వన్యమృగ సంరక్షణ కేంద్రంలో ఏనుగు పైన కూర్చుని ఖడ్గ మృగాల ఫోటోలు తీసుకోవచ్చు. అతి సమీపంలోని విమానాశ్రయం—జోర్‌హట్.

**మానస్**: మానవుడు అదుపులో పెట్టని అద్భుతమైన అడవులు. ఇక్కడి వన్యమృగ సంరక్షణ కేంద్రంలో అనేక రకాల జంతువులు ఉంటాయి. అతి సమీపంలోని విమానాశ్రయం—గౌహతి.

**బుద్ధగయ**: బుద్ధ భగవానుడు జ్ఞానోదయం పొందిన క్షేత్రం. చుట్టూ ఉన్న పవిత్ర ప్రదేశాలు—రాజ్‌గిర్, నలంద. అతి సమీపంలోని విమానాశ్రయం—పాట్నా 113 కిలోమీటర్ల దూరంలో ఉంది.

**దీఘా**: బంగారు కాంతుల ఇసుక, బంగాళా ఖాతపు చల్లటి నీలి జలాలు. కలకత్తా విమానాశ్రయం నుంచి సులువుగా ఈ బీచి విశ్రాంతి కేంద్రం చేరుకోవచ్చును.

## పడమర

**గోవా**: తెల్లటి నురగలతో అందంగా ఉండే సముద్ర తీరంలో గంటల తరబడి కూర్చోవచ్చు. డబోలిమ్ విమానాశ్రయంలో ప్రారంభమయ్యే విహార యాత్ర.

**బొంబాయి**: పశ్చిమ భారతావనికి ముఖ ద్వారం. నిత్యం హడావుడిగా, చైతన్యంతో తొలికసలాడే గొప్ప నగరం. అంతర్జాతీయ విమానాశ్రయం.

**అహ్మదాబాదు**: గాంధీ మహాత్ముని సబర్మతీ ఆశ్రమం, కదిలే స్తంభాల మసీదు. మధ్య, ఆధునిక యుగాల సమ్మేళనం. ఆధునికమైన విమానాశ్రయంతో.

ఎక్కడనుంచి అయినా కొద్ది సేపు విమానయానమే.

ఇండియన్ ఎయిర్‌లైన్స్ అతి త్వరితంగా వెళ్ళే విమానాలతో, దేశమంతటా గల సర్వీసులతో మిమ్మల్ని ప్రతీ చోటుకు చేరవేస్తుంది.

మీ ట్రావెల్ ఏజెంటు అన్ని ఏర్పాట్లతో మీకు సహాయపడతారు.

CAS-344-Tel

Get set for



PATA 78 India Sri Lanka

ఏలు ప్రదేశాలకు IA ద్వారా ప్రయాణం చేయండి

**ఇండియన్ ఎయిర్‌లైన్స్**



# ఆమెకథ



రసజ్ఞప్రేక్షక మహాశయులకు—

ఎన్నో చిత్రాలు విడుదల అవుతూవుంటాయి..
అందులో కొన్నింటికి పోటీలుకూడా పెడుతూవుంటారు.
పోటీలు పెట్టడం మీకు కొత్తగా అనిపించకపోవచ్చు!
కాని- కాస్త క్లిష్టతరమైన పోటీ పెట్టినప్పుడు దిగ్భ్రమ
కలుగుతుంది! అదిగో... అలాంటిదే మీకిప్పుడు
ఎదురయ్యేది! మీరీ మధ్యకాలంలో ఏ చిత్రంలోనూ
ముగ్గురు కథానాయికలను చూసి వుండరు-మాచిత్రంలో
చాలా అవసరమయి- ఆ ముగ్గురినీ పెట్టి చిత్రం
రూపొందించాం! మీలో యిప్పటికే అధికశాతం
'ఆమెకథ' చూసివుంటారు ఒకటికి రెండుసార్లు....
ఇంకా చూడనివారు చూడండి! చూసి- ఈక్రింద
మేమిచ్చిన ప్రశ్నలకు సమంజసమైన సమాధానాలు
పంపండి! అందులో అత్యుత్తమమైన సమాధానాన్ని
ఎన్నిక చేసి... **మంచిబహుమతి** యిస్తాం!

దర్శకత్వం: కె. రాఘవేంద్రరావు

నిర్మాత: క్రాంతికుమార్

- * **సుజాత**... జయసుధ
  * **అనసూయ**.... ప్రభ
  * **చంద్రవదన**.... శ్రీప్రియ
  
  ఈ ముగ్గురిలో ఎవరు ఉత్తమంగా నటించారు?
- మీరు ఉత్తమమని భావించిన నటి ఏయే దృశ్యాలలో బాగా నటించింది?
- అంత బాగా నటించడానికి కారణం దృశ్యం బలంగా వుండటమా? దర్శకుని చాతుర్యమా?

గడువుముగింపు.. 20-12-1977

సమాధానాలు పంపవలసిన అడ్రస్

శ్రీఅన్నపూర్ణ సినీ ఎంటర్‌ప్రైసెస్
23-తిలక్ స్ట్రీట్- టి-నగర్
మద్రాసు-17






NAVRANG

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం · 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
|1938-1972|
శుక్రవారం : 23-12-'77
పింగళనామ సం. మార్గశిర బ. త్రయోదశి
సంపుటము 71 సంచిక 14
సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ
★
పోస్టులో ఏడాది చందా రు 41-60
ఆరు మాసాల చందా రు 20-80
విడి ప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక



(ఫోటో : జే పి )














— చిన్న సీరియల్

# పి.ఏ. హిమబిందు

జొన్నలగడ్డ లలితాదేవి

అది ఒక పెద్ద ఆఫీసు బిల్డింగు. అందులో బోలెడు గదులు. ఆ గదుల్లో రకరకాల డిపార్ట్‌మెంట్లు. ఆ డిపార్ట్‌మెంట్లలో చాలా మంది మగ, ఆడ ఉద్యోగులు. వాళ్లల్లో రకరకాల మనస్తత్వాలు ఒక్కో డిపార్ట్‌మెంటుకూ ఒక్కో మేనేజరు. ఈ మేనేజరు లందరిపైనా పెత్తనం చలాయించే జనరల్ మేనేజరు మరొకరు. అతనికి నాలుగంకెల్లో పెద్ద జీతం. తిరగడానికో కారు. కూర్చోడానికో ఎయిర్ కండిషన్డు రూము. ఆ రూముల్లో ఫాన్లు, ఫోన్లు, గ్రాడేజి బీరువాలు.

అతని జీతానికి తగినట్టే అతని డ్రస్సు. ఆ డ్రస్సులో చిరునవ్వుల్ని, చిరు కోపాలనీ అకారణంగానే ప్రదర్శించే నేర్పున్న పర్సనాల్టీతో ఎప్పుడూ తన హోదాని నిలబెట్టుకునేందుకు తాపత్రయ పడుతూనేవుంటాడు కాని అది ఎవరికీ తెలియనీయడు. అతని పేరు శ్రీపతి. సామాన్యంగా ఆఫీసుకు శ్రీపతి పావుగంట తక్కువకాని ఆలస్యంతో వస్తాడు. వచ్చిందగ్గర్నుంచి లేటుగా వచ్చిన చిరు గుమాస్తాల ఫైలు అరగంట పరిశీలించి అరడజను తాఖీదులు డిపార్టుమెంటు మేనేజర్లకి పంపుతాడు. వాళ్ళు మాత్రం తక్కువ వాళ్లు కాదు గనుక వెంటనే టైపు కొట్టించి అందరికీ తలో మెమో అందించి తమ హోదా నిలబెట్టుకొంటారు.

శ్రీపతికి వళ్లు బాగాలేకో, చంటాడికి పాలడబ్బా వేటవల్లో, లేక తనకే కాస్త అస్వస్థత తోచో, లేకపోతే బస్‌లు దొరక్కపోయో పాపం వాళ్లు హడలుతూనే వస్తారక్కడికి. వాళ్ల భయానికి తగినట్టే అయిదు నిముషాల్లో అపాలజీ కోసం అర్జీలు రాసేవస్తారు. ప్రాణాలుసూరు మంటాయి కొందరికి. "చిన్న ఉద్యోగులు చేస్తే మహానేరం అదే పెద్ద వుద్యోగులు చేస్తే గొప్ప" అని మనసులోనే ఉడికిపోతారు మరికొందరు యువరక్తం పొంగులెత్తేవారు, శ్రీపతి ఆదిగాగల పెద్దల్ని తలచుకుని.

అయితే అలవాటుకు విరుద్ధంగా. చిన్న ఉద్యోగస్తులనించి పెద్ద ఉద్యోగస్తులవరకూ ఆనాడు అలా నోరుతెరచి చూస్తుండేటంత ఆశ్చర్యాబ్ధిలో ముంచివేస్తూ శ్రీపతి అసలు టైముకు పదినిముషాలు ముందేవచ్చి తన సింహాసనం మీద ఆసీనుడయ్యాడు.

మరో అయిదున్నర నిముషాలకి "దివి నుండి భువికి దిగివచ్చె దిగివచ్చె పారిజాతమె నీవై నీవై" అన్నట్టు పొడుగు పొట్టికాని చక్కని ఆకృతి, తీర్చిదిద్దినట్లుండే విశాల నయనద్వయం, విరిసిన పూలాంటి నాశిక. పదారువన్నెల బంగారు ఛాయ. శంఖంవంటి మెడ, ఆమెడలో తమ భాగ్యానికి తామే మురిసే ముత్యాల నెక్లెసు, పొడవైన నొక్కుల జుట్టు సగం వరకూ అల్లి వదిలిన జడ. ఆజడలో మల్లెలు మరువం కలిపిన దండ. అసలు అప్సరాంగనంటే ఇలాగే వుంటుంది అర్థంచేసుకోండి వెర్రివాళ్ళల్లారా అన్నట్టున్న ఆమెని చూస్తూనే చిన్నా, పెద్దా, ముసలీ, ముతకావంటి అందరు ద్యోగులకీ మతులుపోయి, గతులు తప్పినాయి. "ఇంత అందాల సుందరి ఏతావునించి వచ్చేసె:" అని ఎవరికివాళ్లే సంశయాత్ములై వుండగా ఆమె తిన్నగా 'శ్రీపతి' గదిలోకి దారి తీసింది. స్ప్రింగు తలుపు తెరచుకొని లోపలికి వస్తూ "గుడ్‌మార్నింగ్‌సార్:" అంటూన్న పసిడి బొమ్మను చూసి నిలువెల్లా పులకించింది శ్రీపతికి. "అబ్బ; ఏం అందం: ఎంత లవ్‌లీగావుంది!" అని తనలోతనే ఆనందపడిపోయాడు శ్రీపతి.

తన చేతిలోని కాగితాలన్ని వినయంగా శ్రీపతి కందించింది ఆ అప్సరాంగన! అతని కెదుటి సీట్లో కూర్చుంది!!

ఆ కాగితాలు పరిశీలిస్తుంటే అతని ముఖం వెయ్యి కాండిల్సు బల్బులా వెలిగిపోయింది. ఆనంద కందళిత హృదయుంతో కంటి కొనలలో వింత కాంతి మెరుస్తుండగా "సో యు ఆర్ మై పి. ఏ" అన్నాడు నవ్వుతూ

"యస్ సార్" అందామె పంచమ స్వనంలో కోయిలమ్మలా.

"ఐ యామ్ వెరీ గ్లాడ్ టు సీ యు" అనుకున్నాడు మనసులో. ఆ మాట పైకి అంటే బాగుండదని. "వెరీ ఫైన్" అని మందహాసం చేసి ఆమెని డ్యూటీలో జాయిన్ చేసుకున్నాడు.

ఇంత అందమైన కుందనపు ముద్ద తన పి. ఏ. అని గర్వంగా చెప్పుకోవాలన్న రంధితో "రండి. డిపార్టుమెంటుల్నీ, మేనేజర్లనీ మీకు పరిచయం చేస్తాను." అంటూ టై, కాలరు సవరించుకుని తన సూదిమొన బూట్లు నిగనిగలాడుతున్నాయో లేదోనని మరోమారు వంగి చూసుకుని అన్నీ బాగానే వున్నాయన్న తృప్తి కలిగాక గబగబా బయటకి వచ్చాడు. వెనక మందగమనంతో రాజహంసలాగ పి. ఏ. అనుసరించింది.

"ఈమె పేరు హిమబిందు. ఈ రోజు నుంచి నాకు పి. ఏ." అంటూ డిపార్టుమెంట్లన్నింటికీ తీసుకువెళ్ళి పరిచయం చేశాడు.

అందరూ ఆమె అందచందాలకి ముగ్ధులై రెప్ప వేయడం మరచిపోయి నోరు వెళ్లబెట్టుకుని చూడసాగారు! అది గమనించగానే ఒక గర్వరేఖ శ్రీపతిలో తొంగి చూసింది.

హిమబిందు ఎంత అందమైనదో అంత చురుకైంది. బి. కాం. ప్యాసైంది. ఆమె టైపు షార్టుహ్యాండ్‌కూడా ప్యాసవడంతో సగం ఆమె అందానికే ముగ్ధుడయిన మేనే

ప్రారంభం!

జింగ్ డైరక్టర్ సురేంద్రనాథ్ ఈ ఆఫీసు లోని జనరల్ మేనేజర్ క్రింద పి. ఏ. గా అప్పాయింట్‌మెంట్ లెటరిచ్చి పంపాడు. జీతం కూడా మంచిదే.

శ్రీపతి అవివాహితుడు అతను సురేంద్ర నాథ్‌కి దూరమూ, దగ్గరాగాని బంధువు శ్రీపతి యం. కాం. ఫస్టుక్లాసులో ప్యాస య్యాడు. యం.కాంతోపాటు అతను పైపై పరీక్షలన్నీ ప్యాసయ్యాడు. రెండుమూడు చోట్ల పనిచేసి కాస్త కాస్త వ్యాపార రంగంలో అనుభవం సంపాదించాడు.

పి. ఏ. హిమబిందు రాకతో ఆఫీసు వాతా వరణమే మారిపోయింది. శ్రీపతి ఠంచనుగా పదయ్యేసరికి సీటులో కనిపిస్తుంటే ఎవరికీ లేటుగా వచ్చేందుకు ధైర్యం చాలక అంతా త్వరగానే రావడం సాగించారు.

హిమబిందు ఆఫీసు వదలగానే ఒకసారి కర్చీఫ్‌తో ముఖం తుడుచుకుని బస్‌స్టాపులో నిలబడి బస్‌కోసం నిరీక్షించడం ఎకౌంట్స్ డిపార్ట్‌మెంట్ మేనేజర్ గోవిందరావు గమనించి "హల్లో పి. ఏ. గారూ బస్‌కోసం నిలబడ్డారా ?" అంటూ ప్రశ్నించాడు.

"అవును" అంది ఆమె మందహాసం చేస్తూ.

"ఇంతమందిలో యిలా నిలబడి బస్ కోసం వెయిట్ చేసేబదులు హాయిగా ఆఫీసు దగ్గర రిక్షా మాట్లాడుకుని వెళ్ళిపోరాదా ?" గోముగా ఆమె కళ్ళల్లోకి చూస్తూ అడిగాడు.

హిమబిందు అతన్నిచూసి వో చిరిపినవ్వు విసిరింది. ఆ నవ్వుకి డంగైపోయాడు గోవిందరావు.

హిమబిందు జవాబివ్వబోయేలోగా తనే రిక్షా పిలిచి "అమ్మగారిని యింటిదగ్గర దించేయవోయ్" అంటూ రూపాయినోటు చేతిలో వుంచాడు తన జేబులోంచి తీసి.

హిమబిందు నవ్వుతూ "మారుతీనగర్" అంటూ రిక్షాఎక్కి కూర్చుని చెయ్యి వూపింది. గోవిందరావు గాలిలో తేలిపోతూ తనూ చెయ్యి వూపాడు. అలా రిక్షా కను మరుగయ్యేదాకా వూపుతూనే వున్నాడు. అదిచూసి అక్కడ బస్‌కోసం నిలబడిన ఆడామగా జనమంతా తమలోతామే నవ్వు కున్నారు.

పాపం గోవిందరావది గమనించకుండానే మహోఉత్సాహంగా వెళ్ళిపోయాడు.

గోవిందరావుకి వోట్లో నువ్వు గింజనానడం అనేది అతని జాతకంలోనే లేదు. ఆ రాత్రి అతనికి నిద్ర పట్టలేదు సరిగదా తెల్లారి అరగంటముందే ఆఫీసు చేరుకుని తన డిపార్టుమెంట్ స్టాఫ్ రాగానే ఘనంగా చాటుకున్నాడు తను క్రితంరోజు చేసిన ఘనకార్యాన్ని గురించి. ఆ డిపార్టు మెంటుతో పనిబడి వచ్చిన డిపార్టుమెంట్లు క్లర్కులకి యథోచితంగా ప్రాపగండా చేసారు ఎక్కౌంట్స్ డిపార్టుమెంటువాళ్ళు.

హిమబిందు ఇవన్నీ విని తనలో తనే నవ్వుకుంది. కాని శ్రీపతి మాత్రం నొసలు చిట్లించాడు.

"చూడండి. మిస్. హిమబిందూ! ఈ రోజునుంచి నాతోపాటు కారులో రండి. డ్రాప్‌చేస్తాను యింటిదగ్గర." అన్నాడు పేపర్ వెయిట్ ఆడిస్తూ

"మీరు రమ్మనాలేగాని రాకుండా ఎలా వుంటాను ?" అంది తీయగా అతనికేసి చూసి.



## పి. ఎ. హిమబిందు

ఆ మాటకి చాటంత అయింది శ్రీపతి ముఖం.

శ్రీపతి కారులో హిమబిందు దర్జాగా ఇంటికి వెళ్ళిపోవడం గమనించిన మిగిలిన వారంతా నోరు తెరచి అట్లే వుండి పోయారు !!

*　　*　　*

"ఇదేనా ? మీ యిల్లు ?" నవ్వుతూ అడిగాడు శ్రీపతి.

"అవును. లోపలికి రండి." అంది "హిమ" వయ్యారంగా జడని వెనక్కి తోసుకుంటూ.

శ్రీపతి లోపలికి అడుగుపెట్టాడు. అది రెండే గదులున్న చిన్న వాటా. వెనక వైపు గదిలో వంటసామగ్రి, ముందు గదిలో బల్లా, కుర్చీలు, 'సింగిల్‌కాట్'. దాని పైన చక్కగా అమర్చిన పడక. ఒక ప్రక్క నిలువుటద్దం. దాని ముందు అలంకరణ సామగ్రి. మరో ప్రక్క బట్టల బీరువా. ఎంతో పొందిగ్గా నీటుగా సర్ది వున్నాయి. టేబుల్ పైన వేసిన క్లాతుగాని, డోర్ కర్టెన్స్‌గాని ఎక్కడా చిన్న దుమ్ముకూడా లేక ఎంతో శుభ్రంగా వున్నాయి.

"మీకు అలంకరణపట్ల, పరిశుభ్రత పట్ల మక్కువ ఎక్కువనుకుంటాను."

"అవును. ఎ థింగ్ ఆఫ్ బ్యూటీ ఈజ్ ఎ జాయ్ ఫరెవర్" అన్న కీట్స్ కవిమాటలా నాకు సౌందర్యం అంటేను, దాన్ని ఆరాధించడమంటేను చాలా యిష్టం. సామాన్యంగా చాలామంది "బాహ్య సౌందర్యం కంటే అంతఃసౌందర్యంముఖ్యం" అంటారు. ఆ మాటతో నేను మాత్రం ఏకీభవించను. ఎందుకంటారా : మనిషిని చూడగానే ఆకర్షించేది రూపము. ఆకృతేగదా చూసీచూడగానే అబ్బ : చాలా బాగుంది ! అనో చాలా బాగున్నాడు ! అనో మన నేత్రస్సు తెలియ జేస్తుందిగాని ఇతని మనస్సు అద్భుతం. లేదా ఆమె మనస్సు వెన్న అంటూ తెలియ జెప్పదు కదా: ఆత్మపరంగా అవగతం కావాలంటే నిదానంమీద, బాగా స్టడీ చేసిన మీదటకాని తెలియదు. అలా స్టడీ చేయ డానికి ఆ వ్యక్తిపైన అభిమానం జనించాలి అభిమానం జనించాలంటే ముందు ఆకర్షించే రూపం ఉండాలి. ఆ రూపానికి

మనం ముగ్ధులమైతేనే మాట్లాడాలి స్నేహం చేయాలి అన్న కోరిక రెచ్చగొట్టేస్తుంది. ఇది నా అభిప్రాయం మాత్రమే సుమండోయ్'' అంది హిమబిందు చిరునవ్వుతో ఫేన్ ఆన్ చేస్తూ.

"మీ అభిప్రాయంతో నేనూ ఏకీభవిస్తాను'' అన్నాడు చేతి రుమాలుతో పట్టని చెమటని అద్దుకుంటూ శ్రీపతి.

ఆ మాటకి విప్పారింది హిమబిందు వదనం.

"నా అభిప్రాయాలు. మీ అభిప్రాయాలు ఒకటే అయినప్పుడు నన్ను మీరు అంటారు దేనికి?'' ఓరగా అతని కేసి చూస్తూ అడిగింది.

ఆ చూపు మన్మథుడు సంధించి వదలిన పుష్ప బాణంలా శ్రీపతి గుండెల్లోంచి దూసుకుపోయింది.

"ఏమన మంటారు?''

"హిమా! అని నోరారా పిలవండి?'' హొయలు పోయింది పి. ఎ.

"అందమైన నీలాంటి జవ్వని 'హిమా' అని పిలవమన్నప్పుడు కాదనే మూర్ఖత్వం ధైర్యం కూడా నాకు లేవు హిమా!'' అని మధురంగా నవ్వుతూ జవాబిచ్చాడు శ్రీపతి!

"నేను నిజంగా అందమైన అమ్మాయి నేనా?'' అంటూ ఆశ్చర్యం నటించింది హిమ.

"నీ అందాన్ని వర్ణించాలంటే మళ్ళా ఏ "పోతనో'', ఏ "శ్రీనాథు''డో దిగి రావాలి. నాబోటి సామాన్యుడివల్ల ఏమవుతుంది? లేదా ఏ రవివర్మలాంటి గొప్ప చిత్రకారుడినో అయితే నీ సౌందర్యాన్ని కుంచెలతో చిత్రించి నీ ముందుంచేవాడిని.''

"థాంక్ గాడ్! మీరలా అవన్నీ అయి నన్నిబ్బందిలో పెట్టకుండా రక్షించినందుకు భగవంతుడికి నేను కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.'' అంటూ కొంటెగా నవ్వి లోపలికి వెళ్ళింది హిమబిందు. మరో పది నిముషాల్లో వేడి వేడి కాఫీ రెండు కప్పుల్లో పోసి తీసుకు వచ్చింది.

ఆమె అందాన్ని త్రాగుతున్నట్లుగా ఫీలవుతూ ఆమెకేసి చూస్తూనే కాఫీ త్రాగడం పూర్తి చేశాడు శ్రీపతి.

"మరి వస్తాను హిమా!'' అన్నాడు లేచి నిలబడుతూ.

అలాగేనన్నట్టు తల వూపుతూ తనూ లేచి నిలబడి గుమ్మందాకా వచ్చింది.

శ్రీపతి కారు స్టార్టుచేస్తూ చేయి వూపాడు. తనూ చేయి వూపుతూ మందహాసం చేసింది హిమబిందు.

## 2

హిమబిందు ఒక రిటైర్డ్ స్కూలు మాష్టరుగారి అమ్మాయి. ఆయన ఒక్కగానొక్క కూతురికి విద్య చెప్పించడమే ధ్యేయంగా పెట్టుకున్నట్టు ఆమె డిగ్రీ పుచ్చుకునేదాకా జీవించి ఇక పెళ్ళి విషయం ఆమెకే వదలి కన్నుమూసాడు.

తల్లి అసలు తండ్రి ఉన్నప్పుడే మంచం దిగని వ్యాధిగ్రస్తురాలు. ఇప్పుడిక దిగేవని లేకుండా మంచమే శరణ్యంగా కొట్టుకుని హిమబిందు ఉద్యోగంలో చేరబోయేముందే తనువు చాలించుకుంది. ఏకాకి అయిన హిమబిందుకు ఉద్యోగము, ఉద్యోగంలోని వ్యక్తులే ఆప్తులు అయ్యారు.

మొదటినించీ ఆమెది చాలా విచిత్రమైన స్వభావం. చిన్నప్పట్నించీ ఆమెకి అందం పట్ల మోజు ఎక్కువ. రెండుపూటలా తెల్లని బట్టలు వేసుకోవడమే గాదు అవి ఎక్కడ మాసిపోతాయోనని కుదురుగా ఒక చోటే కూర్చునేదిగాని ఆ వయసు పిల్లలతో కలిసిమెలిసి ఆడటానికి సుతారమూ ఇష్టపడేదికాదు. పుస్తకాలకి రంగు రంగుల ఆకర్షణీయమైన అట్టలువేసి రోజులో ఎక్కువభాగం అవిచూసి మురిసేది.

స్కూల్లో కూడా బాగా అందంగావుండి మంచి డ్రస్సు వేసుకుని వచ్చేవారితోనే మాట్లాడేది. అనాకారులు, సామాన్యులు ఆమెకసలు నచ్చేవారుకాదు. బాల్యం నించీ వచ్చిన ఈ అందంపట్ల ఆమెకున్న అభిరుచి పెద్దయ్యాక ఇంకా ఎక్కువయిందేకాని పిసరెత్తు తగ్గలేదు. అయితే విశేషమేమిటంటే ఆమెకి కూడా భగవంతుడు రంభా సౌందర్యాన్ని ప్రసాదించడం. తన అందం పట్ల తనకి విశేషమైన నమ్మకము, ఆత్మ విశ్వాసమూ, గర్వమూ కూడా వుండేవి. భగవంతుడు తీర్చిదిద్దినట్టు పెట్టిన అవయవ సౌష్టవానికి, తన అంద చందాలకీ తనే పరవశిస్తూ గంటలకి గంటలు అద్దంముందు కూర్చుని వివిధ కోణాలలో తననితాను చూసుకునేది మురిసి పోయేది.

ఆఫీసులో అవివాహితులు, వివాహితులు, జుట్టు నెరిసినవాళ్ళూ కూడా తన రూప లావణ్యాలను చూసి ముగ్ధులయి చిన్న చిరునవ్వు, ఓ కడగంటిచూపు తనపై విసిరేస్తే చాలనే వుద్దేశంతో పరితపిస్తూండటం, కావాలని పలకరిస్తూ కాఫీలు, టీలు, లాంటివన్నీ ఆఫర్ చేస్తూ తమ చేతిఖర్చు వదుల్చు



కున్నాగాని అవన్నీ పట్టించుకోకుండా ఆమె స్వీకరించిందే చాలని సంతృప్తి చెందడం అన్నీ గమనించేది హిమబిందు అందుకే తనలోతానే నవ్వుకుని వూరుకునేది.

## పి. ఏ. హిమబిందు

కాని ఆమె మనస్సుకు నచ్చినట్టు అన్నీ మూసబోసుకున్నవాడు శ్రీపతి మాత్రమే.

అందమైన రూపం, దానికి తగిన ఖరీదైన డబ్బు, మంచి హోదాగల ఉద్యోగం, అతని అర్హత అన్నీ ఆమెని బాగా ఆకర్షించాయి.

(ఇంకా ఉంది)




ముప్ఫై యేండ్ల తరువాత మళ్ళీ ఇటుపడి నడుస్తున్నాను— ఆ బాట మీద! అరఫర్లాంగు దూరం నడవాలంటే అయిదు కాకుంటే పది నిముషాలు అటూ యిటూ రిక్షాకోసం పొరాడే మనసు సరాసరి నాలుగు మైళ్ళు నడవడానికి నిశ్చయించుకొనిందా బాటమీద! ఆశ్చర్యం—

ఆ చిన్న వయస్సులో అమ్మ కట్టిచ్చిన సద్దిబువ్వ నొక చంకన తగిలించుకొని, పలకా పుస్తకాలు మరొకచేత పట్టుకొని ఉదయాన నాలుగు మైళ్ళు, సాయంత్రము కాళ్ళీడ్చుకొంటూ నాలుగు మైళ్ళు నడిస్తేనేకాని ప్రాథమిక విద్య పట్టుబడేదికాదు. ఆ బాటమీద అలుపూ సొలుపు ఎరుగకుండా నాలుగేళ్ళు నడిచాయి చదువుకోసమని!

ముప్ఫై యేళ్ళనాటి అనుభూతులు మనస్సులో మెదులుతూంటె దారి జరిగిన సంగతి తెలియడమే లేదు. గొబ్బిళ్ళ మిట్ట దాటి నడుస్తున్నాను. ఆ చిన్ననాటి మధురానుభూతులు మనస్సును మత్తెక్కిస్తుంటే నడుస్తున్నట్టే తెలియకుండా నడుస్తున్నాను.

## పులికంటి కృష్ణారెడ్డి

“ఏవూరన్నా మీది?”— పాతికేళ్ళ పడుచువాడు— ఆ, బాటమీదే నడుస్తున్నవాడు— నన్ను ప్రశ్నించాడు. చెప్పాను.

“ఇప్పుడే ఊరికి పోతావుండేది?”

చెప్పాను.

“ఏం పనిమీద నువ్వు జక్కిదొనకు బొయ్యేది?”

చెప్పాను!— ఆమీదట అర ఫర్లాంగు దూరం మా ఇద్దరిమధ్య మాటలు లేవు.

ముప్ఫై యేళ్ళ క్రిందట వాతావరణములో జరిగిన మార్పులు గమనిస్తున్నాను.

“అదిగాదన్నా! — అడిగిందానికి పుల్లిరిసినట్టు 'ఆఁ! ఊఁ!!' అటుండావే!... యేం? నోటి ముత్యాలు రాలిపోతాయా!” అమాయకంగా అడిగాడు పడుచువాడు.

పెదవుల మీద ఓ చిరునవ్వు క్షణికంగా మాయమయింది. పసిగట్టాడు పడుచువాడు

“ఎందుకన్నా నవ్వుతుండావు ?” — మళ్ళీ అదే అమాయకత.

“ఏమీ లేదు నాయనా! మేము చదువుకునేరోజుల్లో ఈబాటమీద దినమూ నాలుగు నాలుగు ఎనిమిది మైళ్ళు నడిచేవాళ్ళం అప్పుడిదంతా బ్రహ్మాండమైన అడవి. పొదచెట్లు బయలుగా తయారయిందే!... అందుకే నవ్వొచ్చింది! — చక్కగా సర్దుబాటు చేశాను. “అదా ?...ఏఁవుంది ?... ఎవుడికిబలఁవుంటే వాడు మొనగాడికాలంలో ఇంటిదూలాలకని కొందరు, బొగ్గులకని మరి కొందరు, అడివినంతా నరకి పారేస్తావుంటే పొడిసెట్లు గాకేవుంటాయి ?” అడిగిన ప్రశ్నకు సమాధానం దొరికింది. అక్కడికి ఆపితే ఆ అమాయక ప్రాణిమనసు దెబ్బతింటుంది. అలా కాకూడదనుకున్నాను.

“నువ్వెంత వరకు వస్తున్నావు తమ్ముడూ ?”

“నేనూ జక్కిదొనం దాకానే !”

“మీదేవూరు ?”

“గొబ్బిళ్ళ మిట్ట”

“పెండ్లయిందా ?”

“ఆఁ... అయింది !... అప్పుడే ఆయిదేండ్లయి పోలా ?”

శరీరాభిమానం

## ధర్మపథం

— బులుసు వేంకటరమణయ్య

ప్రతి శరీరధారికీ 'నేను, నాది' అనే అహంకార, మమకారాలు ఉండడం సహజం. అవి ఉన్నంతకాలం ఆత్మ పరిశుద్ధంగా ఉండదు. అందువలన వాటిని మనస్సునుండి పారదోలడానికి ప్రయత్నించాలి. వాటిని పోగొట్టుకోవాలంటే ఎడతెగని అభ్యాసం ఉండాలి. సహనశక్తి అధికంగా ఉండాలి.

మనం అన్నం వండుకోడానికి బియ్యం కావాలి. వరిబియ్యపు గింజచుట్టూ ఊక ఆవరించి ఉంటుంది. అది తీసివేస్తేనేగాని బియ్యపుగింజ స్వరూపం తేలదు ఆ గింజ కూడా ఎర్రగా ఉంటుంది. దానిని దంచి నలగగొడితేనేగాని ఎరుపుచాయ పోదు అది తవుడుగా మారి, తెల్లని బియ్యపుగింజను మనకు అందిస్తుంది. అందుకోసం మనం ధాన్యాన్ని దంచాలి. దంచగా దంచగా పైనున్న పొట్టు గింజ నుంచి వేరుపడుతుంది. తర్వాత చెరగాలి. అప్పుడు ఊక తేలిక అగుటవల్ల దూరంగా ఎగిరిపోయి గట్టి గింజ మిగులుతుంది. తర్వాత మళ్ళీ దంచాలి. అలా దంచితే గింజపైనున్న ఎర్రని ఆవరణ తవుడుగా మారి వేరు పడుతుంది. దంచిన తర్వాత చెరిగితె తవుడు తేలిక అయినందువల్ల దూరంగాపడి, తెల్లని బియ్యపు గింజలు మిగులుతాయి. అవి పక్వానికి యోగ్యంగా ఉంటాయి.

మన ఆత్మ తెల్లని బియ్యపుగింజ వంటిది. దానిని ఆవరించి ఉన్న ఊక, తవుడు అహంకార మమకారాలవంటివి. ధాన్యాన్ని ఒక్కసారి దంచితె ఊక, తవుడు వదలవు అవి బాగా నలిగేవరకూ దంచవలసినదే! తర్వాత చెరగవలసినదే! దానికి ఎంతో పరిశ్రమ, ఓపిక ఉండాలి. అలా చెయ్యకపోతే మంచి—పరిశుభ్రమైన బియ్యం దొరకవు ఎంతో అభ్యాసంచేసి ఓపిక పట్టివుంటే క్రమక్రమంగా అహంకార మమకారాలు తొలగిపోతాయి. అవి తొలగిపోతే శరీరాభిమానం నశిస్తుంది. ఆత్మ పరిశుద్ధమవుతుంది. తత్వపగతికి అహంకార మమకారాలు పూర్తిగా పోవాలిగదా!

## భూతవైద్యుడు

"ఎంత మంది బిడ్డలు ?"

మాటకుమాట తడుముకోకుండా బదులు చెబుతుండిన తమ్ముడు ఈసారి బదులు పలకలేదు. తల వాల్చి మౌనంగా నడుస్తున్న అతని వాలకం చూస్తుంటే – 'ఎందుకడిగావూ?' అని మనస్సు చివుక్కు మన్నది. ఏదోవిధంగా ఊరట పరచాలను కొన్నాను.

"ఇంకనూ బిడ్డలు కనలేదన్న మాట!"

తల అడ్డంగా తిప్పాడు తమ్ముడు.

"దానికేముందిలేవయ్యా ? అయిదేండ్లకే బిడ్డలు కలుగకపోతే మునుక పోయేదేముంది కొంత మందికి పదేండ్లకు కూడా సంతానం కలుగుతూ వుంటుంది. అలా ఎంతమందిని మనం చూడలేదు ?"— సమాధాన పరచాలని ప్రయత్నించాను.

"నీపేరేమిటి తమ్ముడూ ?" గోముగా అడిగాను.

ఒక్కసారి నావైపు చూశాడు. కనుకొలకుల్లో నీరు తిరుగుతున్నాయా? అనిపించింది. మళ్ళీ తల వంచుకొంటూ 'పర్దేసు' అన్నాడు.

"మాడు పరదేసూ! ఇందాక నన్ను, మాట్లాడితే నోటి ముత్యాలురాలిపోతాయా? అని అడిగి, యిప్పుడు నువ్వు మాట్లాడకుండా నడుస్తున్నావే! ఇది సరిపోతుందా?"

"అదిగాదన్నా!"– సందేహంగా చూస్తూ నసుగుతున్నాడు మనిషి.

"చెప్పు తమ్ముడూ!" అప్యాయత ఉట్టిపడేలా అడిగాను.

"నేనొక కర్మ పట్టోడిని!"

"ఏం జరిగిందయ్యా?"

"ఇప్పుడు నా కెందుకు పెండ్లంటే యినకుండా అయిన సంబంధమని, కాసిపోసేదానికి దిక్కులేదనీ, అమ్మ నాయనా మొత్తుకుంటే, ఒక్కగానొక్క బిడ్డను వాళ్ళమాటను కాదనేదెందుకని ఒప్పుకుంటి. పెండ్లి చేసుకుంటి, నా కర్మేమోకాని— బొట్టు గట్టింది మొదలు నేను దగ్గరికి పోతేచాలు. గెడ్డన పడిన శాప మాదిరిగ యిలయిల కొట్టుకుంటూ పడిపోతుంది. నోట్లో నురుగులు గక్కుతుంది"- గొంతు బొంగురు పోయింది పరదేసుకు. ఈ వింత విడ్డూరంగా తోచింది. పరదేసు పరిస్థితికి మనస్సు కలుక్కుమనింది.

"డాక్టర్లకు చూపలేదా పరదేసూ?"

"ఒకరా యిద్దరా! ఎవురే పేరు చెప్పితే వాళ్ళ దగ్గరికంతా పోతి. రూపాయను దమ్మిడనుకొని పెట్టు పెడితి. కర్మ రోగం పంటే ముడుపులు గట్టితి. మొక్కవలసిన దేవుళ్ళకంతా మొక్కితి. ఏంవిలాభం?— యింటిచుట్టూ అప్పులోళ్ళు తిరుగుతూంటే ఈ దిగుల్తో ముసిలోళ్ళిద్దరూ మంచ మెక్కిరి"— పడిన బాధలు తలచుకొనేసరికి పరదేసు మాటల్లో నిస్పృహ తొణికిసలాడుతూ వుంది జీవితాన్ని ఆనందంగా అనుభవించవలసిన పాతికేళ్ళ వయసులో పాపం! పరదేసు పడుతున్న బాధలను వింటుంటే మనసు వికలమయ్యింది అయినా నెత్తి బరువు కాదుగదా దించడానికి!–

"అయితే యిప్పుడు జక్కిదొనం యేం పని మీద వస్తున్నావు పరదేసూ?"

"కర్మ రోగంవూకాదు. అసలు రోగం అసలే కాదని తేలేసరికి దెయ్యం పట్టిందేమో చూపించమన్నారు."

"దెయ్యమా?"

"అవును."

"నీకు నమ్మకముందా?"

"యాదొచ్చినోడు ఎర్రోడు గదన్నా? ఎవురేం జెపితె అదంతా చెయ్యాల్సిందే!"

"అయితే దెయ్యానికి జక్కిదొనానికియేం సంబంధం?"

"అదేందన్నా అట్టంటావే? దెయ్యాల తోలడానికి కొల్లూరి పుల్లయ్యకు మించిన మొనగాడీ పాయకట్లో లేడుగదా?"

"ఎవరు ?...కొల్లూరు పుల్లయ్యా!" ఆశ్చర్యంగా అడిగాను.

"అవునన్నా!"

ఆ మాటతో బుర్ర గిర్రున తిరిగింది. ముప్పైయేళ్ల వెనక్కు వెళ్ళింది! ...

ఆ రోజుల్లో బుడంకాయంత బుల్లోడు పుల్లయ్య. పంగాయకు కాళ్ళు చేతులని పొరకపుల్లలు గుచ్చినట్లుండేది అకారం.

ఎవ్వరూ ఆ ఆకారాన్ని 'కొల్హారు పుల్లయ్యా!' అని పిలిచిన పాపాన పోలేదు. నాకు వినే అదృష్టము కలగలేదు. 'ఒరే కొల్హారూ!'' కొందరంటే; మరికొందరు 'పుల్లయ్యా!' అని ఆప్యాయంగా పిలిచేవారు. కొందరు, 'ఒరే పుల్లిగా!' అనేవారు. ఎటు పిలిచినా పలికేవాడు. చెప్పినపని చేసేవాడు. పెట్టింది తినేవాడు. వంకాయ లాంటి వంటిలో పొరకపుల్లల్లాంటి కాళ్ళూ చేతులు బోద పుల్లలయ్యేసరికి ఆ వూళ్ళో అల మందకు నాయకుడయ్యాడు పుల్లయ్య. అంతవరకే నాకు గుర్తు. మరియిప్పుడేమో దెయ్యాలని తరుముతున్నాడట !

గతస్మృతి మనస్సులో మెదిలేసరికి చిరునవ్వు పెదవులపై వెలసింది. మళ్ళీ చిరునవ్వుకు కారణం అడుగుతాడేమో పరదేసు అని సందేహంగా అతని వైపు చూశాను. వంచిన తల ఎత్తకుండా నడుస్తున్నాడతడు. మా లోకంలో మేముంటే దారి జరిగిన సంగతే తెలియలేదు. ఈ లోకంలో పడేసరికి ఊరి ముందర మేమున్నాం. ఆ తరువాత మా దారులు వేరైనాయి! 'వస్తానన్నా!' అంటూ నా వద్ద సెలవు తీసుకొన్నాడు పరదేసు. ముప్పైయేళ్ళ ముందటికీ యిప్పటికీ పోలికలే లేని ఆ వూరిని పోల్చుకోలేని స్థితిలో బిక్కమొహంతో యింటిదారి పట్టాను.

ఇంట్లో అడుగు పెట్టానో లేదో అందరు చుట్టుకొన్నారు. కొండెక్కినంత సంబరపడి పోతున్నారందరు, 'దారెలా కనుపించింది నాయనా!' అని కొందరు, 'వాడు పెద్దోడైపోయాడులే!' అని కొందరు తలకొక తీరుగా వ్యాఖ్యానిస్తున్నారు. మా అప్పయ్య వదినెమ్మను వంటింటి వైపు పురమాయించి, సేద్యగాడిని ఆకుతోటకు అరటాకుల కోసం తరిమాడు. ఇంట్లో వున్నానన్న మాటేకానీ మనస్సంతా పుల్లయ్య మీదే వుంది. వంటకాల్లో మసాలా మాత్రమే కాదు మాటల్లో మమకారాన్ని కూడా రంగరించి పెడుతూంటే మా వదినమ్మ — సుష్ఠుగా భోంచేశాను. చేతి మీది తడి ఆరకముందే పుల్లయ్య యింటిముందు నిలబడ్డాను.

సుమారు పాటిమిద్దె వాకిట నిలువురాళ్ళ మీద పందిర. ఇంటిముందు పెద్ద గానుగ చెట్టు. వెనుక భాగానేమో వేపచెట్టు, చల్లగా వుంది వాతావరణం. పందిరి క్రింద పెద్ద క్యూ నిలబడి వుంది. ఆడా మగా అందరూ ఒకే వరుసలో నిలబడ్డారు. కొంతమంది ఆడవాళ్ళకు చంకన బిడ్డలున్నారు. కొందరికి లేరు. చూడటానికి ముక్కాలి పీట మోస్తరుగా వుంది. అయితే కాస్త ఎత్తుగా వుంది. ఆ పీట మీద కూర్చున్నాడు పుల్లయ్య. ఎర్రటి తలపాగా ...పసుపులో తడిపిన పంచెకట్టూ ... కోడికత్తుల్లా మెలిదిరిగిన మీసాలు నొసట రూపాయ బిళ్ళంత కుంకుమ బొట్టు. చేత వేపమండ ! గంభీరంగా వున్నాడు మనిషి. ఎడతెరపి లేకుండా నోరు, అంతకు మించి చేయి ఆడుతూనే వున్నాయి. అల్లంత దవ్వులో ఆ పందిరి కిందనే శిష్యవర్గం కొబ్బిలు మూడు రంగుల నూలు దారాలు, ముప్పిరిదీసి, దారాలు పేని, ఆ దారాలకు పసుపు గుడ్డలు చుట్టి దండలు తయారు చేస్తున్నారు.

చూడముచ్చటగా వుంది వాతావరణం. చూస్తూ నిలబడ్డాను.

నా రాకను గమనించాడు పుల్లయ్య. ఒక్కక్షణం కనుబొమ ముడిచాడు. మరు క్షణమే ముడి వడిన కనుబొమ్మల్ని చిత్రంగా ఎగురవేశాడు. కనుబొమ్మలెగురుతూంటే చిరునవ్వు పెదవులపై మెలికలు తిరిగింది. ఆ పరిధిలో ఆతని కను సన్నలు రాజ్యమేలుతున్నాయనిపించింది—ఓ శిష్యుడు యింట్లోకి పరిగెత్తి ఓ కుర్చీ తెచ్చివేస్తూంటే! కూర్చోమన్నట్లు సైగచేశాడు పుల్లయ్య. కూర్చున్నాను.

కుడిచేతి వేపమండ ఆడుతూనేవుంది. నోరు పోటీ పడినట్లు గొణుగుతూనేవుంది. ఆనందంతో నిండిన కన్నులు నన్ను పలకరిస్తూనేవున్నాయి. అప్పుడప్పుడూ మాత్రం 'ఓం! హ్రీం! శ్రీం!' అనిగట్టిగా అరుస్తున్నాడు. మంత్రించవలసిన వాళ్ళకు మంత్రం ...దండవేయ వలసిన బిడ్డలకు దండ ... నొసటి విభూతి కొందరికి— రక రకాలుగా సాగుతూవుంది వైద్యం! ఎడమ చేతో తాంబూలం అందుకోవడం,అందులోనిదక్షిణ డబ్బులు ఒడిలోదోపుకోవడం, పగులగొట్టిన టెంకాయ చిప్పలను జాగ్రత్తగా బుట్టలో వేయడం— క్షణం తీరిక లేదు పుల్లయకు. కన్నార్పకుండా గమనిస్తూ కూర్చున్నాను.

'క్యూ' ముగిసేసరికి పొద్దుక్రుంకింది. అప్పటికి కాస్త తెరిపిచిక్కింది పుల్లయ్యకు. పైకి లేచాడు. బద్ధకంగా ఒళ్ళు విరిచాడు. కుడిచేతిని మూడుసార్లు ఝాడించాడు. 'ఇదుగో యిప్పుడే వస్తున్నా బాబూ!' అంటూ లోనికేగాడు అతడు. లేవడంతో శిష్యవర్గం ఆ ప్రదేశాన్ని శుభ్రం చేయడానికి పూనుకొంది. ఒక్కడు టెంకాయ చిప్పలగంపతో కుస్తీ పడుతుంటే మరొక్కడు అక్కడ గుట్టలా పేరుక పడిన వేపమండలు తీస్తున్నాడు. ఆనాటి సంపాదన అర్ధాంగిచేతుల్లో పోస్తున్నాడేమో పుల్లయ్య దోసిలిపడుతూండే గాజుల చప్పుడు, చిల్లర డబ్బులు దోసిల్లో పోస్తూవుండే గలగల శబ్దము శ్రావ్యంగా వినిపిస్తున్నాయి.

చిక్కంలో సంకటిముద్ద వేసుకొని చంకన తగిలించుకొని ఆవులవెంట పడుతుండిన



పెళ్ళివారు స్నానాలకు మంచి ఏర్పాట్లు చేశారోయ్!

ఆనాటి పుల్లయ్యకు ఈనాటి పుల్లయ్యకు ఎక్కడికెక్కడ ? అన్న ఆలోచనలో పడి నాకు తెలియకనే నేను నవ్వుకొంటున్నాను.

"ఏం బాబూ; నీలో నువ్వేనవ్వుకొంటుండావు ? ఎక్కడికెక్కడనా ?" ఎదురుగా వేసిన సింహాసనంలాంటికుర్చీలో కూర్చుంటూ పుల్లయ్య అడుగుతున్నాడు.

అతని వంక చూద్దునుగదా!, ఇప్పుడు తలగుడ్డ లేదు. నుదుట పెద్ద కుంకుమ బొట్టు కనురెప్పలను కలుపుతూ నస్సగా మారింది. స్నానం చేసి వచ్చినట్లుంది. మల్లె పువ్వులాంటి తెల్లటి పంచె, లాల్చీతో మనిషి హుషారుగా వున్నాడు. అతడు కుర్చీలో కూర్చున్నదే తడవుగా ఓ శిష్యపరమాణువు భుజాలు పడుతూంటే మరొక శిష్యాగ్రణి కాళ్ళు పట్టుతున్నాడు.

"ఏం చెయ్యమంటావు బాబూ! చూస్తున్నావుగదా? పొద్దు మొలచింది మొదలు పొద్దుగూట్లో పడేదాక యిదీవరస! వళ్ళు గుల్లవుతుందంటే నమ్మండి!"— శిష్యుల చేతలకు సంజాయిషీ యిస్తున్నాడేమో గురువు అనిపించింది.

చిరునవ్వు సమాధానంగా ఆసక్తిగా అతనివి చూస్తున్నాను.

"వాడి లీలలు ఎవరికెరుక బాబూ! ఎప్పుడెప్పుడికి ఏంచేంవి? ఎందుకు చేస్తాడో వాడికే తెలియాలి. మంచి తెలివితేటలిచ్చి దానికి తగిన చదువిచ్చి, ఉద్యోగం పేరుతో మిమ్మల్ని ఊరుగాని ఊరికి తరిమాడు. బాయిలో కప్ప మాదిరి నన్నిక్కడ్నే వుండమన్నాడు. ఎవురెవురిని ఎక్కడెక్కడవుంచినా ఎవురికెట్ల బ్రదుకుదెరువు చూపించాలో వాడికే తెలుసు. కోటి విద్యలు కూటి కొరకే గదా బాబూ!"—

మనిషి మాత్రమేగాదు మాటలు కూడా బాగా తీరిగాయి.

"పూలమ్మిన చోట కట్టెలమ్మడం కష్టంగా వుంటుంది కానీ కట్టెలమ్మిన చోట పూలమ్మడంలో ఎంతో ఆనందం వుంది బాబూ! ... అంతా వాడి లీల!!" నిమీలిత నేత్రాలతో చేతులు జోడించాడు పుల్లయ్య.

ఆర్థికంగానే కాదు మానసికంగా కూడా పై మెట్టుమీద వున్నాడు పుల్లయ్య. అతనిని కదిపి గత స్మృతిలో క్రిందికి దింపడానికి అంగీకరించలేదు మనసు. పరిస్థితులు

# భూతవైద్యుడు

మారితే మనిషి తదనుగుణంగా తనంతట తానుగా ఎలా మారగలడో ఆలోచిస్తున్నాను. అంతలో అతని శ్రీమతి కాబోలు! రెండు కప్పుల కాఫీతో ప్రత్యక్షమయింది. ఒకటి నా చేతి కందించి తానొకటి తీసుకున్నాడు పుల్లయ్య. కాఫీ త్రాగబోతూ 'మిద్దింటి బాబే!' అని పరిచయం చేశాడు శ్రీమతికి.

ఆ రోజుల్లో ఆ పల్లెకు దిష్టిచుక్కలాగ నిలబడింది ఒక్క మిద్దె కాబట్టే మా వాళ్ళు 'మిద్దింటోళ్ళు' గా చలామణి అయ్యారు. ఇప్పుడా వూరంతా దాదాపు మిద్దెలే!— పుల్లయ్యక్కూడా వో మిద్దె

## గ్రీన్ సిగ్నల్ !

లైసెన్సు లేని కుర్ర'కారు'
రివర్సు గేరులో పోతుందా ?
స్టీరింగు పట్టుకున్న నాన్నగారు
సడెను బ్రేకు వేస్తున్నారా ?
శిథిల సాంప్రదాయం
గతుకుల రోడ్డుమీద
ఏక్సిడెంట్లు తప్పవు కద !
కూడలిలో నుంచున్న
అభ్యుదయ ట్రాఫిక్కు సుందరి
చూపులతో
ఇచ్చినట్టుంది గ్రీన్ సిగ్నల్
దూసుకుపోవాలి కుర్రకారు
డ్రైవర్ని లెక్కచెయ్యకుండా
వేగంగా...ఇంకా వేగంగా !

— రా మ సూ ం.

వుంది. అందుకే 'మిద్దింటిబాబు' అన్న మాట అర్థరహితంగా తోచిందేమో ఆమెకు అదోరకంగా నన్ను చూస్తూ ఒక్క నమస్కారం విసిరేసి వెళ్ళిపోయింది. ఇదిలావున్నా నా మనస్సంతా పరదేసుమీదేవుంది. అందుకే అడిగాను.

"పుల్లయ్యా! పరదేసు యేమయినాడు" అని.

"ఏ పరదేసు?... ఓ! ఆ గొబ్బిళ్ల మిట్ట కుర్రోడా! వచ్చిపోయ్‌నాడే!"

"మరి వాడి పనేంచేశావు?"

"హ్హ హ్హ హ్హ హ్హ......" కుర్చీ నిండుకు కూర్చుని నోటినిండుకు నవ్వుతున్నాడు పుల్లయ్య.

"అదంతే బాబూ! కొన్ని కొన్ని కేసుల్ని తల్చుకొంటుంటే వద్దనుకుంటే కూడా నవ్వొస్తుంది"

"ఇంతకూ వాడి కేసేంవంటావ్?"

మళ్లీ నవ్వడానికారంభించాడుపుల్లయ్య. అతని ధోరణి నాకు అంతుబట్టలేదు.

"ఎందుకలా నవ్వుతావ్?"

"ఏమని చెప్పమంటావ్ బాబూ! కొన్ని కొన్ని దెయ్యాల కత బలే యిస్త్రంగా వుంటుంది. మొగుడొల్లకపోతే ఒకరకం దెయ్యం... మొగుణ్ణొల్లకపోతే యింకొక రకం దెయ్యం... వైడు మొగుడుంటే అదిమరీ సోద్దెమయిన దెయ్యం... రేపు అది వారం వస్తానని మాటిచ్చాను. పోనీ! నువ్వు కూడా రారాదా బాబూ! దెయ్యం కత సూద్దువుగానీ— పాపం! కుర్రోడు శానా దెబ్బతినేసినాడు!"

"ఏంబాబూ ఆలోచిస్తుండావు ?"

"ఏమీలేదు పుల్లయ్యా! అంతవరకు సెలవు లేదు. అయినా ఈ కేసు చూడడానికి తప్పక రావాలనిపిస్తూ వుంది — వస్తాను."

కాలం ఆగదని నిరూపించడానికన్నట్లు ఆదివారం వచ్చింది. పుల్లయ్య నుండి నాకు పిలుపు వచ్చింది. వెళ్లాను.

వో శిష్యపరమాణువు సాయంతో మూటముల్లె సర్దుకుంటున్నాడు పుల్లయ్య. తలపాగా చుట్టిన వైనము, మెలిదిరిగిన మీసాలకు మెరుగు పెట్టడము, నుదుట తీర్చిదిద్దిన కుంకుమ బొట్టు — ఆ వేషంలోనే భూతవైద్యుడు కనుపిస్తున్నాడు. మనిషిలో ఎక్కడలేని గంభీరత వచ్చింది. చేత 'సోటాకట్టె' పట్టి, కిర్రుచెప్పులు తొడిగి బయలుదేరాడు. నడిచే వెళ్దామన్నాను వద్దన్నాడు. పదిగంటల వేళ ఆ బాట మీద వచ్చిన బస్సు ఎక్కాము. నాలుగు మైళ్ళ దూరం బస్సు ప్రయాణం. ఎంతసేపని ? — కన్నుమూసి తెరిచేలోపుగా గొబ్బిళ్ళ మిట్టలో దిగాము

మా కోసమే ఎదురు చూస్తున్నట్లుంది పరదేసు బాట మీద. బస్సు ఆగీ ఆగడంతోటే నడక పరుగ్గా వచ్చాడు. నన్నుజూచి ఉబ్బితబ్బిబ్బు లయ్యాడు. "నువ్వుగూడా వచ్చేసినావు గదన్నా!" అని ఆప్యాయంగా

(36వ పేజీ చూడండి)

# రైలుబండి ఎంచక్కా ఎక్కుదాం

పార్లే గ్లూకో ఎంచక్కా మెక్కుదాం

ప్రతి పాప నోట్లోనూ

## పార్లే గ్లూకో మజా రుచితో... ఎంతో శక్తితో




పాలు, గోధుమలు, పంచదార, గ్లూకోజ్‌లలోని శక్తినిచ్చే తత్వం గల పోషక పదార్థాలతో నిండి వున్నాయి పార్లే గ్లూకో బిస్కట్లు.

పార్లే

గ్లూకో — భారత దేశంలో అత్యధికంగా అమ్మబడే బిస్కట్




వరల్డ్ సెలక్షన్ బహుమతి విజేత

everest/952/PP tl

# హైదరాబాద్ నోట్ బుక్

## యుగయుగాల భారత మహిళ

కొందరు నివురుగప్పిన నిప్పుల్లా వుంటారు. తీరా చేసిన పని చూచినప్పుడు గాని అబ్బో! ఎంత గొప్ప వారు వీరు! అని విస్తుపోతాము. అలా విస్తుపోయేట్టు చేసిన వారు శ్రీమతి జె. వరలక్ష్మి. ఈమె హైదరాబాద్ నోట్‌బుక్ ద్వారా పాఠకులకు ఇదివరకే పరిచితురాలు. ఈమె ఎంతోకాలంగా కృషిచేసి, ఎందరినో సంప్రతించి, ఎన్నెన్ని గ్రంథాలో అవలోకించి రచించిన యుగయుగాల భారతమహిళ అనే ఉద్గ్రంథం ఆవిష్కరణ నవంబర్ 29న ఆంధ్ర సారస్వత పరిషత్తు అధ్వర్యాన, మౌలానా అబ్దుల్ కలాం అజాద్ పరిశోధన సంస్థలో డాక్టర్ గోపాల రెడ్డి అధ్యక్షతన జరిగింది. రాష్ట్ర గవర్నర్ శ్రీమతి శారదాముఖర్జీ ఇది యుగయుగాల భారత మహిళా చరిత్ర అని, ఇది అన్ని భాషలలోకి అనువదితం కావాలని, కోరుతూ, పుస్తకాన్ని ఆవిష్కరించారు. డాక్టర్ దివాకర్ల వెంకటావధాని గ్రంథంలోని విషయాలను వివరించారు. ఈ గ్రంథం రచించినందుకు ఈమెకు కళాప్రపూర్ణ బిరుదం ఇవ్వాలన్నారు. డాక్టర్ సి. నారాయణరెడ్డి సత్యాన్వేషణకు, శైలీపోషణకు ఈ గ్రంథం తార్కాణమన్నారు. ఇది భారత్ వరనారీ చరిత్రమని డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యం అన్నారు. శ్రీ దేవులపల్లి రామానుజరావు రచయిత్రిని ప్రశంసించారు. డాక్టర్ గోపాలరెడ్డి తమ అధ్యక్ష ప్రసంగంలో ఇది చరిత్ర. దీనికృషి ప్రశంసనీయమే. కాని, పాతదంతా గొప్ప దనడానికి వీలులేదు. ఇప్పటికీ స్త్రీ వెట్టిదాసిగానే వుంది. పాతదే అంతా బాగుంటే, శారదాచట్టం, సతీచట్టం వారసత్వచట్టం వచ్చేవి కావు. ఇంకా స్త్రీ ప్రతిపత్తి మారాలి భారత స్త్రీ సహధర్మచారిణిగానేకాక సహకర్మ చారిణి కావాలని ఆశిస్తున్నాను అన్నారు. డాక్టర్ రెడ్డి ప్రసంగంలో ఏదో కొత్త భావమో, పదబంధమో కాంతిరేఖో జాలువారుతూనేవుంటుంది. శ్రీమతి వరలక్ష్మి ధన్యవాదాలు చెబుతూ, తాను ఒక వ్యాసం వ్రాయదలచుకొని, ఇంత గ్రంథం వ్రాశానని, దానికి పలువురు తోడ్పడ్డారని అన్నారు.

## గ్రామసీమలకు వైద్యులు :

మన రాష్ట్రంలో ఏటా కొన్ని వందలమంది వైద్య శాస్త్రంలో పట్టభద్రులవుతున్నారు, ప్రభుత్వోద్యోగాలు లేవని ఆక్షేపిస్తూ, విదేశాలకు వెళ్లడానికి మెడను ఎప్పుడూ పడమటివైపే తిప్పుకుని వుంటారు. విదేశాలకు వెళ్లి కొన్నిఏళ్లు వుండి లక్షలు సంపాదించుకొని వచ్చిన నా మిత్రుడొకడు హృదయ విదారకమయిన సంగతి చెప్పాడు మిత్రమా ఇన్నేళ్లు అమెరికాలో వున్నావు గదా! వైద్యశాస్త్రంలోని విశేషాలను గ్రహించావా? అని అడిగాను. తీరికేది? సమయమంతా ఒకరి క్లినిక్‌లోనే గడచిపోయింది. అన్నాడు మిత్రుడు. క్లినిక్‌లో చికిత్స చేసిన కొత్త రోగాల విధానం పై గ్రంథాలు వ్రాసి ఇతరులకు దారి చూపవచ్చుగదా! అన్నాను. నేను చూచిన రోగాలేమిటి? అక్కడివారు మర్మాంగాలను అంత పరిశుభ్రంగా వుంచుకోరు. కనుక నేను ఇన్నేళ్ళు చూచినది కొన్ని వేల పురీషద్వారాలు కావలసినంత డబ్బు. ఇక మీదట ఏమైనా చేయాలి. అన్నాడు. నేను నోరు తెరచుకొని ఉండిపొయ్యాను కనుక విదేశాలకు వెళ్లేవారంతా వైద్యశాస్త్రంలో పారంగతులయి వస్తారని భ్రమించనక్కరలేదు. విదేశ ప్రయాణం వ్యామోహం మాని, కొంత సేవా దృష్టితో వుంటే, స్వదేశంలోనే ఎంతో సంపాదించవచ్చు. ఇంతకూ వైద్యం, విద్య వంటి వృత్తులు కేవలం డబ్బు ప్రధానమయినవి కావు. సేవాప్రధానమైనవి. సంపాదనా, సేవా కలిసి వచ్చే గ్రామీణ వైద్య వత్తి పథకం వైద్యులకు వరప్రసాదంగా ప్రభుత్వం ప్రతిపాదించింది. ఈ పథకం కింద పని చేసే ఎం. బి. బి. ఎస్. లు ప్రభుత్వం ఎంపిక చేసిన గ్రామంలో పని చేయాలి. ప్రభుత్వం 500 రూపాయలు నెలసరి బత్తెం, మందులకు వంద ఇస్తుంది. ఐదేళ్ళ ఖాయం. అంతలోగా వైద్యుడు పుంజుకుని పరిసర గ్రామాల వారికి సేవచేసి, కావలసినంత పలుకుబడీ, డబ్బూ సంపాదించవచ్చు. ప్రైవేటు ప్రాక్టీసు బలిసి, ప్రభుత్వోద్యోగాలు మానిన వారు వేనకువేలున్నారు. నిరుద్యోగులమనుకునే వైద్య పట్టభద్రులు ఈ పథకం నుంచి లాభం పొందవచ్చు.

(50వ పేజీ చూడండి)

సీరియల్

# రాగబంధం

## యార్లగడ్డ సరోజినీదేవి

*(గత సంచిక తరువాయి)*

రిజల్టు తెలుసుకునే వంకతో లెక్చరర్‌ని కలవాలని ఇంట్లో చెప్పి బైలుదేరిన విజయ సరాసరి తోటకి వెళ్లింది.

అప్పటికే అక్కడ టాక్సీ ఆగివున్నది. ఎవరు వచ్చారా? అనుకుంటూ నెమ్మదిగా గేటు తీసుకుని లోపలికి వెళ్లింది. హాలు తలుపులు దగ్గిరకు చేర్లవేసి వున్నవి. లోపల ఎవరో వున్నారని గుమ్మం ఇవతలే ఆగిపోయింది. లోనుంచి స్త్రీ కంఠస్వరం వినిపించగానే ఆ కంఠం మేరీదని గుర్తించి ఉలిక్కిపడింది.

"మనం చాలా తొందరగా వివాహం చేసుకోవాలి శ్రీనివాస్! యింక చాటుమాటు వ్యవహారాలకి స్వస్తిచెప్పాలి!" మేరీ కంఠం.

"వివాహమా ?"

"ఏం అంతలా ఆశ్చర్యపోతున్నావు? ఇప్పుడు వివాహం జరిగితీరవలసిందే? నేను నలుగురిలో తల ఎత్తుకోలేను."

"నా కలాంటి ఉద్దేశ్యంతో నీ స్నేహం చెయ్యలేదు !"

"కోరికలు తీర్చుకోవటానికి చేశావా స్నేహం ?"

"అందుకు నువ్వు అడిగినప్పుడల్లా డబ్బు ఇస్తూనేవున్నాను !"

"అంటే నా మానాభిమానాలకి నువ్వు వెలకట్టి డబ్బు యిచ్చావన్నమాట ? నీనుంచి డబ్బు తీసుకుంటున్నప్పుడు నేనలా అనుకోలేదు ! నువ్వు నా మనిషివని, నేను నీకు కాబోయే భార్యనని భావించాను !"

"నువ్వేలా భావించినా నాకిష్టమే! కాని నేను నిన్ను పెళ్లి చేసుకునే ఉద్దేశ్యం లేనేలేదు."

"లేకపోతే ఎలా? నాకిప్పుడు మూడవనెల!"

"ఆఁ ..."

"ఎంత జాగ్రత్తపడ్డా లాభంలేకపోయింది. మనం ఎంత తొందరగా వివాహం చేసుకుంటే అంత మంచిది ! ఈ సంగతి మా నాన్నగార్కి తెలిసిందంటే చాలా గొడవ అవుతుంది. నలుగురికీ తెలియకముందే మనం వివాహం చేసుకోవాలి !"

"అదిప్పుడు జరగటం అసంభవం !" విసుగ్గా జవాబు ఇచ్చాడు.

"అసంభవం యెలా అవుతుంది ? నానుంచి నువ్వు తప్పించుకోలేవు ! నా బ్రతుకు ఏంకాను ? నమ్మించి ఇంత మోసంచేస్తావా ?" పెద్దగా అంటూనే ఏడవసాగింది మేరీ !

"ప్లీజ్ మేరీ! అంత గట్టిగా మాట్లాడకు! ఏడవకు ! నీకు పుణ్యంవుంటుంది. నీకెంత డబ్బయినా ఇస్తాను. లేడీ డాక్టర్ దగ్గిరకెళ్లి అబార్షన్ చేయించుకో !"

"అది జరుగని పని ! నాలో పెరుగుతున్న నీ రూపాన్ని నవమాసాలూ మోస్తానుగాని హత్య చెయ్యను. నువ్వు వ్రాసిన ప్రేమలేఖలు నాదగ్గిరే వున్నవి. న్యాయంగా నువ్వు ఆలోచించకపోతే మన వివాహం కోర్టు చేస్తుందని మరువకు !"

మేరీ ఉత్తరాలు గురించి బైటపెట్టేసరికి అంత మనిషీ నీరుగారిపోయాడు. కాళ్ళల్లో వణుకు బయలుదేరింది. మేరీతో స్నేహం ఇంత దూరం వస్తుందని ఊహించలేకపోయాడు. విశ్వం ప్రేరేపణతో ప్రేమలేఖలు వ్రాసి నోట్సుల్లో పెట్టి అందించేవాడు. కొత్త ఒక వింత ! పాత రోతలాగా అనిపించింది శ్రీనివాస్‌కి. మేరీ కోర్టుకు వెళ్లితే తనకి కోర్టు విధించే శిక్ష ఏమిటో తెలుసు ! అదీగాక విజయ వచ్చే టైం ! వస్తానన్న టైంకి వస్తుంది విజయ. ఎంత తొందరగా మేరీని పంపించితే అంత మంచిదిగా భావించాడు. ఇప్పుడేమని జవాబు చెప్పితే మేరీ ఇక్కడనుంచి వెళ్లుతుందో ఆలోచించసాగాడు.

"ఆదివారం ఇంకా మూడురోజులున్నది. ఆరోజుకి చర్చిలో మన వివాహం! అది తప్పించావంటే మీ నాన్న పరువుని గంగలో కలుపుకున్నవాడివవుతావు ! సమాజంలో నీకొక స్థానంలేకుండా పోతుంది. ఆలోచించుకో !"

"నీలాంటివాళ్లందరినీ వివాహం చేసుకున్నట్లయితే ఈసరికి నూరుమంది భార్యలు అయ్యేవారు !" పెద్దగా నవ్వాడు శ్రీనివాస్.

"చివరికి నువ్విలాంటి జవాబే చెప్పతావని నాకు తెలుసు ! నీలాంటివాళ్లని చాలామందిని చూశాను. ఎలాంటి ఉచ్చువేస్తే బిగుసుకుంటుందో నాకూ తెలుసు ! మీ నాన్న, ది గ్రేట్ బిజినెస్ మాగ్నెట్ రామనాధంగారి గారాలబిడ్డవు ! సరిగ్గా ఇవ్వాల్టికి మూడురోజు లున్నది. నన్ను వివాహం చేసుకుంటావో ? లేక లక్ష రూపాయలు చెల్లించుతావో ఆరోజుకి! ఈ రెండు షరతులలో దేనికి అంగీకరించినా ఇష్టమే ! మూడే మూడు రోజులున్నది !"

జవాబుకయినా ఎదురుచూడకుండా తలుపులు తెరుచుకుని మేరీ బైటికి వచ్చింది.

మేరీకి కనిపించకుండా పక్కకి తప్పుకుంది విజయ. చాలాసేపు చెట్లచాటునే నిలబడింది. లోపలికి వెళ్లటానికి మనస్కరించలేదు. బాగా ఆలోచించుకుని ఒక నిశ్చయానికి వచ్చిన విజయ శ్రీనివాస్‌కి కనిపించకుండా అడుగులో అడుగు వేసుకుంటూ కారు దగ్గిరకు వచ్చింది. మాలి చూసి వెంబడించాడు.

"మీ చినబాబుగారికి చెప్పవద్దు నేను వచ్చి వెళ్తున్నట్టు !"

"ఎందుకని అమ్మగారూ ?..."

"అదంతే !..."

విజయ కారు ఎక్కి వెళ్లిపోయింది. మాలి వెనుతిరిగి వెళ్లిపోయాడు. శ్రీనివాస్ బైట నిలబడి విజయ కోసం ఎదురు చూడసాగాడు. దూరంగా కారు శబ్దం వినిపించింది. విజయ వస్తున్నదనుకుంటున్నాడేగాని అది వేరే కారుగా అనిపించలేదు. అలా అరగంట వరకూ ఎదురు చూసి చూసి విసుగ్గా లోపలికి వచ్చి కుర్చీలో కూర్చున్నాడు. వస్తానని ఫోన్ చేసిన విజయ ఎందుకని రాలేదు ?? ఏదో కారణం వుండి వుంటుంది. లేకపోతే యిలా చెయ్యదు తప్పకుండా వస్తుంది. వచ్చి తనతో ఏం మాట్లాడుతుంది ?? అమ్మ కబుర్లేమయినా చెప్పతుందేమో ? ?...

**జరిగిన కథ-13** ముప్పయ్యేళ్లతర్వాత పుట్టింటి కెళ్లిన పార్వతమ్మ, వదిన జానకి చనిపోవటంతో చిన్ననాడే తండ్రిని, ఇప్పుడు తల్లిని కోల్పోయిన విజయని తనతో తీసుకువస్తుంది. తన ఈ ఉన్నత స్థితికి కారణం భార్య పార్వతమ్మేనని రామనాధం నమ్మకం. పార్వతమ్మ పెద్దకొడుకు భాస్కరం. అతని భార్య సుందరి. సుందరికి నల్గురితో కలిసిమెలసి తిరగటం గిట్టదు. చిన్నకొడుకు శ్రీనివాస్‌కి దుడుకుతనం ఎక్కువ. పాతికేళ్ల క్రితం... పరంధామయ్యగారి కొడుకులు జగన్నాధం, గోపాలంల భార్యలు సుభద్ర, జానకిలు. కాపురానికి వెళ్లకుండానే వైధవ్యం పొందిన ఆడబిడ్డ పార్వతికి వివాహం చేయటానికి మామగారి అనుమతి తీసుకుంటుంది జానకి. సుబ్బయ్య మాష్టారి శిష్యుడు రామనాధంతో పార్వతి వివాహం జరిపిస్తుంది జానకి. ఇద్దరు మగపిల్లల తల్లవుతుంది పార్వతి. పార్వతి జీవితం చక్కబడిందనే తృప్తితో కళ్లు మూస్తాడు పరంధామయ్య ... విజయ బి. ఏ. లో చేరుతుంది. చదువుమీద శ్రద్ధలేక దురలవాట్లకు లోనైన శ్రీనివాస్ దుడుకు స్వభావాన్ని చూసి బాధపడుతుంది విజయ. శ్రీనివాస్ స్త్రీలోలుడని తెలుసుకున్న విజయకు అతనిపై అసహ్యం కలుగుతుంది. తండ్రిమీద పంతంతో ఇంట్లోంచి వెళ్లిపోయి క్లబ్‌లో కాబరే డాన్సర్‌గా చేరతాడు శ్రీనివాస్.

తను ఇంటికి రానందున తల్లితండ్రులు ఎంత బాధపడుతున్నారో విజయను అడిగి తెలుసుకోవాలి!

తనకి డబ్బు ఇవ్వకుండా శాసించుతాడా? నాలుగు తరాలు కూర్చుని తిన్నా తరుగని ఆస్తి! తనో వెయ్యి రూపాయలు ఖర్చుచేస్తే తరిగి పోతుందా!? తను సంపాదించుకోలేడూ? ఆ ధైర్యం తనకి వున్నది అందుకే! అందుకే! అందరికీ దూరంగా వుంటూ నిశ్చింతగా కాలం గడుపగలుగుతున్నాడు.

మేరీ గుర్తుకు వచ్చింది. మేరీని వివాహం చేసుకోక తప్పదు! కాని తనకి ఇష్టంలేదు! పెళ్ళి చేసుకోవాలనుకుంటే ఈ మేరీయే కావాలా? తాను ఎవరితోనూ ఎలాంటి బాదరబందీ పెట్టుకోడు. అవసరం అయితే డబ్బు పారేస్తాడు? అయినా తనదగ్గిర అంత డబ్బు ఎక్కడిది?? తండ్రి ఆస్తిలో తనకీ భాగమున్నది! మైనారిటీ తీరింది. తనకి కావలసిన డబ్బు తండ్రి నుంచి ఎలా రాబట్టాలో? అని ఆలోచించసాగాడు. ఆలోచించి ఆలోచించి చివరికి ఒక నిర్ణయానికి వచ్చాడు శ్రీనివాస్. తండ్రిమీద తాను ప్రతివాదియై నిలబడుతున్నందుకు తనలో తానే గర్వపడసాగాడు శ్రీనివాస్...

## 20

విజయ మనసు అల్లకల్లోలమయిపోయింది మేరీ మాటలు విన్న తరువాత. మగవాడిలోని బలహీనతలను ఆధారం చేసుకుని అలా బెదిరించటం స్త్రీజాతి లక్షణంగా వుంది నేటి పరిస్థితులనుబట్టి! మేరీని చేసుకోవలసివస్తే మామయ్య పరువు ఏమయిపోతుంది? తలెత్తుకుని తిరగ్గలడా మామయ్య? అత్తయ్య బ్రతకగలదా?

కాబరే డాన్సులు! త్రాగుడు! వ్యభిచారి అయిన శ్రీనివాస్‌మీద అంతులేని అసహ్యం కలిగింది ఇలాంటివాడిని కట్టుకుని ఏ స్త్రీ సుఖపడుతుంది? మేరీ అన్న మాటలు విన్నతరువాత విజయకి అంతవరకూ శ్రీనివాస్ మీద వున్న అభిమానంకాస్తా హరించుకుపోయింది ఈ సంగతి అత్తయ్య మామయ్యలకు చెప్పితే వాళ్ళు పడే బాధ తను చూడలేదు. తీరా వివాహం అయిన తరువాత చెప్పి లాభంలేదు? యిప్పుడు చెప్పితే నీకెలా తెలుసని అడిగితే తనేమని చెప్పుతుంది?

ఇలాంటి ఆలోచనలతో మరో రెండురోజులు గడిపింది విజయ రిజల్ట్సు తెలిసే రోజు కావటంవల్ల పేపర్‌కోసం ఎదురుచూడసాగింది ఉదయమే లేచి విజయ.

డ్రాయింగ్ రూంలో పచార్లు చేస్తున్నాడు రామనాథం. అచేతనురాలై సోఫాలో కూర్చుంది పార్వతమ్మ. మరో ప్రక్కగా భాస్కర్ నిలబడి వున్నాడు. అందరి ముఖాల్లోనూ; ఆవేదన; ప్రస్ఫుటించసాగింది. అంత గంభీర సమావేశం ఎప్పుడూ విజయ చూడలేదు. తానక్కడ వుండటం భావ్యంకాదని పక్కకి తప్పుకుంది.

''శ్రీనివాస్ చాలా మంచి పని చేశాడు!' అనుకుంది సుందరి.

రామనాథం ముఖభావాలు చూసి ఎవరూ ''ఏం చేద్దాం!'' అని ప్రశ్నించలేకపోతున్నారు

''దుర్మార్గుడు! ఎంతకి తెగించాడో? యాభైవేలు వెంటనే పంపించినాసరే! లేదా ఆస్తిలో వాటాకోసం కోర్టుకు వెళ్ళుతాడట? అంత డబ్బు ఇప్పుడు ఎందుకో? తాగి తందనాలు ఆడటానికా? అడిగినప్పుడల్లా డబ్బు యిస్తే ప్రోత్సహించినట్లుంటుంది! ఇవ్వకపోతే కోర్టుకి ఎక్కుతాడు? ఏం చెయ్యాలో తోచక పార్వతమ్మ దగ్గిరకు వెళ్ళి ఉత్తరాన్ని విసుగ్గా వడిలోకి గిరవాటేసి మరో గదిలోకి వెళ్ళిపోయాడు

ఉత్తరంలోని కాగితం తీసి మడత విప్పి చదువుకోసాగింది పార్వతమ్మ దగ్గిరకు వచ్చి నిలబడ్డాడు భాస్కర్

మై డియర్ డాడీ!

అర్జంటుగా రేపు సాయంత్రానికంతా యాభైవేలు పంపించండి అలా పంపనియెడల ఆస్తిలో వాటాకోసం కోర్టుకి ఎక్కమంటారా? ఆదివారం ఉదయం పదిగంటలకు చర్చిలో మేరీతో



నా వివాహం! మీ ఆశీస్సులు నాకు కావాలి! డబ్బు పంపుతారా? కోర్టుకి ఎక్కమంటారా? ఆలోచించుకోవలసిన బాధ్యత మీ ముందున్నది! రేపు ఉదయానికంతా మీనుంచి జవాబు రావాలి!''

ఇట్లు,
శ్రీనివాస్.

చదివినది అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తూ ''శ్రీనూ! ఎంత పని చెయ్యాలనుకుంటున్నావు?'' అంటూ కుప్పలా కూలిపోయింది పార్వతమ్మ. భాస్కర్ కంగారుపడుతూ కూజాలోని చల్లటి నీళ్ళు తీసుకొచ్చి తల్లి ముఖంమీద చిలకరించాడు. పేపర్లో రిజల్ట్సు చూసిన విజయ తనకి ఫస్టుక్లాసు వచ్చిందన్న సంగతి మేనత్తకి చెప్పాలని గదిలోకి వచ్చిన విజయకి మేనత్త స్పృహ కోల్పోయివుంటం చూసి భయంతో దగ్గర కెళ్ళి కూర్చుని పేపర్‌తో విసరసాగింది. కొంత సేపటికి తేరుకున్న పార్వతమ్మ లేచి కూర్చుంది.

''ఎలా వున్నది అత్తయ్యా!'' అనడిగింది.

పార్వతమ్మ జవాబు చెప్పలేక కళ్ళనిండా నీళ్ళు నింపుకున్నది. క్రింద పడివున్న ఉత్తరాన్ని తీసి చదివింది విజయ. ఆగ్రహం పట్టలేక ఉండగా చుట్టి నేలకేసి కొట్టింది.

''చినబావేనా ఈ ఉత్తరం మామయ్యకి వ్రాసింది?''

''వాడి స్నేహాలు అలా వ్రాయించాయి విజయా! మేరీని చేసుకుని ఈ ఇంటి పరువు ప్రతిష్టలను మంటగలపటానికికూడా వెనుకాడటం లేదు!'' అన్నాడు భాస్కర్ దిగులుగా!

''మనిషి పరిస్థితికి ఎంత బానిస అవుతాడో తెలుస్తూనే వున్నది. అలా జరగటానికి వీలులేదు పెదబావా! వీలు లేదు! మామయ్య తలెత్తుకుని తిరగలేరు!''

''మన చేతులు దాటిపోయిన తరువాత ఎలా జరిగినా సహించవలసిందే!'' అప్పుడే అక్కడికి వచ్చిన రామనాథం అన్నాడు.

''అసంభవం మామయ్యా! మీరు చెప్పితే మేరీని వివాహం చేసుకోడు. ఆ స్నేహాలూ మానివేస్తాడు చినబావ!''

''వాడిదగ్గరకు వెళ్ళి బ్రతిమాలటం నావల్ల కానిది! ఆస్తి— పరువుప్రతిష్ట పోయినా భరించుతానుగాని ఆ పని మాత్రం నేను చెయ్యను!''

''అందరం పంతాలకుపోతే అయినట్టే మామయ్యా? సరే! చినబావ ఈ పెళ్ళి ఎలా చేసుకుంటాడో చూస్తాను!''

ఉత్తరం పేపర్ తీసుకుని తన గదిలోకి వెళ్ళిపోయింది విజయ.

ఆ రోజంతా ముగ్గురి మధ్యా నిశ్శబ్దం అలుముకున్నది. ఎవరిమట్టుకువాళ్ళు వాళ్ళకి తోచిన విధంగా ఆలోచించుకోసాగారు. రామనాథం చివరికి ఒక నిశ్చయానికి వచ్చి పార్వతమ్మ దగ్గరకు వచ్చాడు. భర్తను చూసి పశ్చాత్తాపంతో తల వంచుకుంది.

''మన పరువుప్రతిష్టలు మరో రెండు రోజులకు బజారుపాలు అవబోతున్నవి. ఇప్పుడే మనుకున్నా లాభంలేదు పార్వతీ! ఇప్పుడిక ఏమిచెయ్యాలో ఆలోచించు!''

''ఆలోచించటానికిమాత్రం ఏమున్నదండీ?''

మేనత్త జవాబు విని విజయ కూర్చున్నదల్లా లేచి కిటికీ దగ్గరకు వచ్చి నిలబడింది.

''అదీ నిజమే! శ్రీనివాస్ ప్రయోజకుడై మనలను ఉద్ధరించుతాడనుకున్నాంగాని యిలా పక్కదారులు తొక్కుతాడనుకోలేదు. వాడు! వాడు! ఆ ఫూల్! నాకు నోటీసు ఇచ్చి ఆస్తిలో వాటా తీసుకుంటాడా? ఆ రాస్కెల్ కనిపించితే డొక్కచించి!...''

కోపంతో ఆవేశంలో రామనాథం మిగతా మాటలు పూర్తిచెయ్యలేదు!

పార్వతమ్మ వస్తున్న దుఃఖాన్ని పమిటచెంగు చాటుపెట్టుకుని ఆపుకున్నది.

''పార్వతీ! నువ్వు తోటలోని బంగళాకు వెళ్ళి అసలు రహస్యం నీ కొడుక్కి చెప్పు! ఈ ఆస్తిమీద నాకుగాని వాడికిగాని ఎలాంటి హక్కూ లేదని చెప్పు! ఈ ఆస్తికి వారసురాలు ఎవరో వివరించి చెప్పు! నువ్వు త్వరగా వెళ్ళకపోతే పరిస్థితి తారుమారు కాగల అవకాశాలున్నవి. ఇంతకాలం ఎవరికీ తెలియకుండా గుప్తంగా వుంచాం. అదిప్పుడు వెల్లడించకపోతే జీవితమంతా శ్రీనివాస్ నష్టపోతాడు. ఆ రహస్యం నువ్వు చెప్పితేనేగాని వీలులేదు!''

జవాబుకయినా ఎదురుచూడకుండా బైటికి వచ్చిన రామనాథం డ్రైవర్‌కోసం కబురుచేశాడు.

విజయ ఆలోచనలో పడింది. ఒక్క మనిషికోసం ఇంతమంది ఎందుకు బాధపడాలి? తనను ఇంతగా ఆదరించి కడుపులో పెట్టుకున్న అత్తయ్య మామయ్య బాధను తను చూడలేకపోతోంది. ఇప్పుడు తన కర్తవ్యం ఏమిటి? తనేం చెయ్యాలి? ఈ అప్రతిష్ట నుంచి మామయ్యను అత్తయ్యను కాపాడేవిధం ఏమిటి? తనవల్ల కాగలిగినదేమయినా వున్నదా? విజయ ఆలోచనలు ఇన్నీ అన్నీ కాదు! చివరికి ఒక దృఢనిశ్చయానికి వచ్చిన విజయ నెమ్మదిగా బైటికి వచ్చింది. ఆమె ఎన్నుకున్న గమ్యం ఒక్కటే!

తనకు నీడనిచ్చిన మేనత్త పరువు ప్రతిష్టలను పోకుండా కాపాడాలి! అదే తన లక్ష్యం! అదే తన దృఢసంకల్పం! తాను అనుకున్నది నెరవేరితే తాను కష్టపడ్డా సంతోషంగా ఆ కష్టాన్ని స్వీకరించుతుంది. తనది ఒకటే లక్ష్యం! అదే!... అదే!...

## 21

విజయ తోటలోకి అడుగు పెట్టుతుంటేనే భయపడింది. తానెన్ని సమస్యలు ఎదుర్కోవాలో? అతి కోపిష్టి శ్రీనివాస్‌ని ఒక పట్టాన నప్పించటం ఎలాగో??...

''నాలో పెరుగుతున్న నీ రూపాన్ని నవమాసాలూ మోస్తానుగాని హత్య చెయ్యను. నువ్వు వ్రాసిన ప్రేమలేఖలు నా దగ్గరే వున్నవి. మన వివాహం కోర్టు చేస్తుంది!'' అన్న మేరీ మాటలు గుర్తుకువచ్చి శ్రీనివాస్ మీద ఏవగింపు కలిగింది.

''ఆదివారం! ఇంకా మూడు రోజులున్నది! ఆ రోజుకి చర్చిలో మన వివాహం! అది తప్పించావంటే మీ నాన్న పరువుని గంగలో కలుపుకున్నవాడి వవుతావు! సమాజంలో నీకొక స్థానం లేకుండా పోతుంది!''

మేరీ బెదిరించుతూ అన్న మాటలు మస్తిష్కంలో మెదలసాగినవి. స్థానం లేకుండా పోయేది నీకా? నా బావకా? చూస్తాను!.

''పళ్ళు మారుకుంది!'' మాలి విజయను చూసి తొందరగా దగ్గరకు వచ్చాడు సంతోషంగా!

''చినబాబుగారు లోపలే వున్నారమ్మా రండి!... రండి!'' అన్నాడు.

చిన్నగా నవ్వుకుంటూ లోపలికి వెళ్ళిన విజయను చూసి శ్రీనివాస్ ఆశ్చర్యపోతూ అలాగే చూస్తూ వుండిపోయాడు.

విజయ కూడా రెప్ప వాల్చకుండా శ్రీనివాస్‌నే చూస్తోంది. పగలు రాత్రిళ్ళు నిద్రలేమితో బాధ పడుతున్నట్టు ఎర్రవారిన కళ్ళు! మాసిన గెడ్డం. కాల్చిపారవేసిన సిగరెట్టు పీకలు! ఎందుకంతగా బాధపడుతున్నాడో అర్థం చేసుకున్నా ఏమీ తెలియనట్టే వుండిపోయింది.

''లోపలికి రా విజయా!''

''నువ్వు పిలవలేదని ఆగిపోయాను చినబావా!!''

''మొన్న వస్తానని చెప్పి రాలేదే??''

''రాలేదని ఎలా అనుకున్నావు? నేను వచ్చాను! నీ స్నేహితురాళ్ళతో నువ్వున్నావు. ఆ సమయంలో నేను రావటం సభ్యత కాదని తిరిగి వెళ్ళిపోయాను. అయినా నువ్వింత సీరియస్‌గా ఆలోచించటం నేనింతవరకూ చూడలేదు!''

''అలా ఆలోచించే అవసరం యిప్పుడిప్పుడే కలిగింది. కాని విజయా ఆ రోజున!!... ఆ రోజున నువ్వు మా మాటలు విన్నావా?''

''విన్నాను!... నువ్వేమని నిర్ణయించుకున్నావు?''

''... ... ... ...''

''ఆ మేరీ కోసమేగా నువ్వు మామయ్యను బెదిరించుతూ ఉత్తరం వ్రాసి పంపావు? ఒక అనామకురాలికోసం రక్తసంబంధాన్నే త్రెంచుకోబోతున్న నీ సాహసానికి మెచ్చకుండా వుండలేకున్నాను. నువ్విలా చెయ్యటం నాకు బాగోలేదు!''

''నాకూ బాగోలేదు విజయా ఎంత ఆలోచించినాను. క్షణిక సుఖం కోసం పక్కదారులు తొక్కే వాళ్ళ బ్రతుకులు మరొకరి చేతుల్లో బందీలయిపోతాయి. నేనిలా ఎందుకు నాశనం అయ్యానో నాకు తెలుసు! పట్టుదల నన్ను ప్రక్కదోవలకి నడిపించింది. అందుకు కారణం డాడీ! ఇదేమిటని నన్ను గట్టిగా మందలించకపోవటంవల్లనే నేనింత మొండివాడిగా తయారయ్యాను. నేను చేసింది నేనే అనుభవించాలి! ఎంత ఆలోచించినా నాకు ఒక్కటే మార్గం కనిపించుతోంది!''

''ఏమిటది చినబావా?''

''మేరీతో నా వివాహం రేపు ఆదివారం చర్చిలో జరగటమే!''

[ఇంకా వుంది]



గోవిందరాజు సీతాదేవి

*ఉదయం పదిగంటలు దాటింది.*

*పిల్లలు స్కూలుకి శ్రీవారు ఆఫీసుకి వెళ్లిపోయారు తండ్రీ పిల్లలూ కల్సి చిందరవందర చేసిన యిల్లంతా సర్దుకుని భోజనం చేశాను.*

వంటిల్లు సర్దుకుని హాలులోకి వచ్చి విశ్రాంతిగా కూర్చుని దినపత్రిక తిరగేస్తున్నాను 'పోష్ట్' పరిచయమైన కేకకి బైటకి వచ్చి పోస్టుమేన్ అందించిన ఉత్తరం అందుకుని దస్తూరీ చూశాను బాల్యస్నేహితురాలు భారతి రాసింది. లోపలికి వచ్చి యీజీ ఛైర్‌లో కూర్చుని కవరు చించాను.

ప్రియమైన గీతా!

చాలారోజుల తర్వాత ఉత్తరం రాస్తున్నానని కోపగించుకోకు. నా పరిస్థితి తెల్సుగనుక నీకు కోపం రాదులే. నీ ఉత్తరం అందుకున్నానుగానీ జవాబు రాద్దాం అంటే తీరిక యెక్కడ ఏడిసింది వెధవ పల్లెటూరు పాడీ పంటా గేదెలూ ఆవులూ పిల్లులూ కుక్కలూ ఈ పెంపుడు జంతువుల పోషణలో క్షణం తీరుబడిలేయి చావటంలేదు ఉదయం అయిదింటికి పక్కమీదనించి లేస్తే రాత్రి పదింటి వరకూ విశ్రాంతి యెరుగని నాకు నీకు జవాబు రాయాలన్న మాట ఎప్పుడు గుర్తుకి వస్తుందో తెల్సునా నిద్ర కళ్లమీదకి ముంచుకు వస్తూండగా పెరటి తలుపు ఘడియ వేశానా లేదా ఆవుదూడకి తాడు ముడి గట్టిగా పడిందో లేదో! రేపు అత్తగారికి శనివారం కనుక గారెలు వండేందుకు మినప్పప్పు నీళ్లలో నానపెట్టానాలేదా! అన్న విషయాలన్నీ మననం చేసుకుంటూవుండగా చటుక్కున గుర్తుకివస్తుంది నీకు జవాబు రాయలేదు అన్న విషయం.

అప్పటికప్పుడు లేచి కూర్చుని జవాబు రాసేయాలనిపిస్తుందికానీ నిద్ర కళ్లమీదకి వచ్చేస్తుంది అంతే తెల్లవారి అయిదింటి వరకూ మెలుకువరాదు. ఉదయం కాఫీ త్రాగుతూ శ్రీవారు గుర్తుచేస్తారు

నీ ప్రాణసఖికి జవాబు రాశావా అని

"అరెరె ... మర్చిపోయాను. ఇవాళ తప్పక రాస్తాను" అనేశానేగానీ దినచర్య మామూలేగా ఇలా వారంరోజులు గుర్తుచేసీ నాచేత నీకు జవాబు రాయించలేని శ్రీవారు ఈవేళ ఏం చేశారో తెల్సునా! కవరు తెప్పించి అడ్రస్ రాసి నాకళ్లకి కన్పించేలా వంట గదిలో పోపుల పెట్టెమీద పెట్టి పొలానికి వెడుతూ—

"నే వచ్చేసరికి ఈ వుత్తరం పోస్టు డబ్బాలోకి వెళ్లిపోవా" అని నా అంత పొడుగు బాణాక్షర పుచ్చుకుని చెప్పులు శబ్దంచేస్తూ వెళ్లారు ఇవాళ ఆయన చెప్పిన పని కాకపోతే యెంత ఆర్భాటం చేస్తారో తెల్సు. తప్పక రాసేయాలి అనుకుంటూనే మర్చిపోయాను ఆయన పొలంనించి తిరిగి యింటికి వచ్చి చెప్పులు విడుస్తూంటే యిప్పటికి గుర్తుకి వచ్చింది చేస్తూన్న పని ఆపి కవరు పట్టుకుని కలంకోసం యిల్లు అంతా గాలించేశాను ఖర్మ కలం దొరికి ఛస్తేనా!

ఉత్తరం చదువుతూన్న నాకు నవ్వువచ్చింది భారతి ఎప్పుడు వుత్తరం రాసినా యిలా కథ చెప్పినట్లే రాస్తుంది. తన జీవితం అంతా ఛలోక్తులుగా చెప్తూ వుత్తరం నింపుతుంది. ఇలా రాయగలగటంకూడా ఒక 'ఆర్టు' అనుకుంటూ వుంటాను. ఇందుకే భారతి రాసిన ఉత్తరాలు మళ్లీ మళ్లీ చదువుకుంటూవుంటాను. ఆలోచనలు నుంచి తేరుకుని మళ్లీ చదవబోతూండగా 'ఆంటీ' అన్న పిలుపు విన్పించింది లేచి సరిగా కూర్చుంటూ వాకి వైపు చూశాను. ఇద్దరమ్మాయిలు నిల్చుని వున్నారు. అందులో ఓ అమ్మాయి నాలుగిళ్ల అవతల వున్న హరిప్రియ. రెండో అమ్మాయి ఎవరో కొత్తపిల్ల హరిప్రియ నవ్వుముఖంతో లోపలికి వచ్చింది. నేను లేచి ఆ యిద్దరికీ కుర్చీలు చూపించి "కూర్చోండి" అన్నాను హరిప్రియ కొత్త అమ్మాయిని పరిచయం చేసింది. "ఆంటీ నేనప్పుడప్పుడూ మీకు చెప్తూండే దాన్ని కృష్ణప్రియ అనీ బాల్‌బాడ్మింటన్ ప్లేయర్ అనీ చాలాచోట్ల చాలాసార్లు మాచ్‌లలో పాల్గొని ప్రైజులు కొట్టేస్తూ వుంటుందనీనూ, ఎం. ఏ. చదువుతోందనీనూ"

"ఆఁ! అవును."

"ఆ కృష్ణప్రియ యీమే. మీరు ఈమెని గురించి చెప్పినప్పుడు ఓసారి అన్నాను గుర్తు వుందా. కృష్ణప్రియ వస్తే నాకు పరిచయం చెయ్యి. ఎందుకో ఆ అమ్మాయిని గురించి నువ్వు చెప్తూంటే ఓసారి తప్పకుండా చూడాలి అన్పిస్తోంది అని. అందుకే తీసుకువచ్చాను."

గుక్కతిప్పుకోకుండా చెప్పేసింది హరిప్రియ

"నమస్కారం. కూర్చోండి" అన్నాను, గౌరవభావంతో ఆ అమ్మాయిని పరీక్షగా చూస్తూ

కృష్ణప్రియ ప్రతినమస్కారం చేసి హరిప్రియ ప్రక్కన కూర్చుంది. నేనూ కూర్చున్నాను కృష్ణప్రియ సన్నగా పొడుగ్గా వుంది. రంగు చామనఛాయ అయినా ముఖంలో కళ వుంది. నీలంరంగు కలకత్తా నేతచీర కట్టుకునివుంది చీరె అంచుకు మాచ్‌అయే రంగు జాకెట్ వేసుకుంది ఎడంచేతికి వాచీ కుడిచేతికి రెండు మట్టిగాజులూ మెడలో సన్నటి బంగారుగొలుసూ ఇంతకిమించి మరే నగలూ లేవు వదులు వదులుగా వాలుజడ అల్లుకుంది. నుదుట గుండ్రటి తిలకం ఎర్రగా మెరుస్తోంది. చెవులకి నక్షత్రాలులాంటి దిద్దులు వున్నాయి. ఆ అమ్మాయి ముఖంలోకి ఎంతసేపు చూసినా యింకా చూడాలన్పించేలా వుంది

ఆ అమ్మాయి చురుకైన కళ్లతో నన్నూ యింటినీ పరిశీలిస్తోంది

"మంచినీళ్లు కావాలా?" అడిగాను

హరిప్రియ 'వద్దు' అంది. కృష్ణప్రియ 'కావాలి' అంది

గాజుగ్లాసుతో మంచినీళ్ళు తెచ్చి యిచ్చాను. కృష్ణప్రియ నీళ్లు తాగి గ్లాసు క్రిందపెట్టి కర్చీఫ్‌తో మూతి తుడుచుకుంది హరిప్రియ కబుర్లు మొదలుపెట్టింది. సినీమాలూ సీరియల్సూ అయిన తర్వాత అంది.

"ఆంటీ! మా కృష్ణ యీ వూళ్లో జరుగుతూన్న టోర్నమెంట్‌లో పాల్గొనేందుకు వచ్చి రెండురోజులైంది అప్పుడే రెండు రౌండ్సు అయిపోయినాయికూడా."

"ఔనా! అరె ... నాకు యిప్పటివరకూ చెప్పలేదేం."

"రావాలనుకుంటూన్నాను. కానీ వీలుకాలేదు"

మా యిద్దరి మాటలూ వింటూన్న కృష్ణ అప్పటివరకూ మౌనంగా వున్నదల్లా కలగ జేసుకుంటూ అంది

"మీకు గేమ్స్ అంటే చాలా ఇష్టంటకదూ. మా ప్రియ చెప్పింది"

"ఔను."

"అయితే రేపు మాకు ఫైనల్సు వుంది ఉదయం ఎనిమిదింటికి స్టేడియమ్‌లో ప్రారంభం అవుతుంది. మీరూ రాకూడదూ చూడటానికి"

"ఔనా! ఫైనల్సులోకి వచ్చారన్నమాట. ఏఏ వూరునుంచి వచ్చాయి లేడీస్ టీమ్సు"

కృష్ణ వివరాలు చెప్పింది. తను ఏఏ టీములని వోడించిందీ ఫైనల్సులో ఎవరితో ఆడవల్సిందీ హుషారుగా చెప్తూ ఆఖరికి అంది

"మీరు తప్పక రండి."

"చూస్తాను వీలుంటే తప్పక వస్తాను."

"వీలుంటేకాదు వీలుచేసుకుని మరీరావాలి"

"అలాగే."

# మధుర స్మృతి



కృష్ణప్రియా, హరిప్రియా కాస్సేపు కూర్చుని నేనిచ్చిన టీ తాగి వెళ్ళిపోయారు. వాళ్ళు వెళ్ళిపోయినా నా మనస్సు కృష్ణ చెప్పిన కబుర్లమీదే వుండిపోయింది భారతి వుత్తరం మాటే గుర్తు లేదు

౭

ప్రతిరోజూ కంటే యింకో గంట ముందుగా నిద్రలేచి పిల్లలకీ శ్రీవారికీ అన్నీ అమర్చేస్తున్నాను చకచకా!

ఇదంతా ఓరకంటితో చూస్తూన్న శ్రీవారు చేసుకుంటూన్న గెడ్డం సగంలో ఆపి మరీ అడిగారు.

"నీ ప్రాణసఖి భారతిగానీ దంపతసహితంగా ప్రయాణంఅయి వచ్చేస్తోందేమిటి! నువ్వు రైలు స్టేషనుకి వెళ్ళాలేమిటీ!"

"కాదు."

"మరి?" ఆశ్చర్యంగా చూస్తూ అడిగారు

"కృష్ణప్రియ అనే అమ్మాయిని హరిప్రియ తీసుకువచ్చి పరిచయం చేసింది అని చెప్పానుకదూ రాత్రి."

"ఊఁ! అయితే?"

"ఆ అమ్మాయి బాడ్మింటన్‌మాచ్ ఫైనల్సు వుంది. అది చూడటానికి వెళ్ళాలి చూడండి వంట కూడా పూర్తి అయింది. కాస్త యివాల్టికి మీరు పిల్లలకి వడ్డించి మీరూ వడ్డించుకుతిని అవన్నీ అలానే వదిలేసి ఇల్లు తాళం వేసి ఎదిరింట్లోవాళ్ళకి యిచ్చి వెళ్ళిపొండి! నే వచ్చి అంతా చూసుకుంటాను.'

"గీతా!" చికాకుగా ముఖం పెట్టారు. ఇదేం పట్టించుకునే స్థితిలో లేను. నా కళ్ళు గడియారంమీదే వున్నాయి. కృష్ణ చెప్పిన టైము అవవస్తోంది. హరిప్రియ ఆటో తీసుకుని అప్పుడే వచ్చేసింది.

"ఆంటీ! రెడీ అవలేదూ యింకా! కృష్ణ గంట క్రితమే వెళ్ళిపోయింది. మాచ్ ప్రారంభం అయే టైము అవుతోంది."

"వచ్చేస్తూన్నానమ్మా!" త్వర త్వరగా డ్రెస్ వేసుకుని హరిప్రియ వెంట వాకిట్లోకి వచ్చి ఆటో ఎక్కేశాను. శ్రీవారు బహుశా ముఖం చిట్లించి చేతిలో వున్న రేజర్ విసిరికొట్టివుంటారు! యింక ఇంటిని గురించి గాని, శ్రీవారిని గురించి గానీ ఆలోచించే అవకాశం లేకపోయింది. నామనస్సు అప్పుడే కృష్ణ ఆడే బాడ్మింటన్‌గేమ్ దగ్గరకి పరుగుతీసింది. ఆటోకంటే కూడా వేగంగా అతివేగంగా.

స్టేడియమ్ చేరుకున్నాం. ఆటోకి డబ్బు యిచ్చేసి లోపలికి నడిచాం

కృష్ణప్రియ మాచ్ ప్రారంభంఅయి అప్పుడే పది నిమిషాలు అయిపోయింది. ఆడవాళ్ళూ మగాళ్ళూ మాచ్ జరిగే కోర్టుచుట్టూ దడి కట్టేసినట్లుగా మూగేస్తున్నారు. "కూర్చోండి. కూర్చోండి" అంటూ అరుస్తున్నారు ఎవరో

హరిప్రియ ఎలాగో వాళ్ళందరినీ తప్పించి బాడ్మింటన్ కోర్టుకి దగ్గరగా తీసుకువెళ్ళింది ఆట చూస్తున్నాను. చాలా సంవత్సరాల తర్వాత మళ్ళీ యివాళ యీ మాచ్ చూసే అవకాశం అన్నా వచ్చినందుకు లోలోపల సంతోషిస్తూ.

కృష్ణప్రియ తన పార్ట్‌నర్‌కి హుషారిస్తూ 'ఫైవ్స్'లో సెంటర్ ఆడుతోంది. నేర్పుగా ఎదటి టీముకి పాయింట్సు రాకుండా అతి జాగ్రత్తగా షాట్సు కొడుతూవుంది. యెదురుగా ఆడే టీమ్‌లోని అమ్మాయిలు కూడా బాగానే ఆడుతూన్నారు. ఇరువైపులవారినీ చుట్టూ చేరిన జనం ప్రోత్సహిస్తూన్నారు. గేమ్ చివరిలోకి వచ్చేసరికి చుట్టూ వున్నవాళ్ళు కేకలూ యీలలూ యెక్కువ అయినాయి.

ఆతురతగా చూస్తూ ఎంపైర్ చెప్పే పాయింట్స్‌ని వింటూన్నాను కృష్ణప్రియ వనజాక్షి టీముని నాలుగు పాయింట్ల తేడాతో గెలవగలిగింది. గెలిచాననే వుత్సాహంతో బ్యాట్ యెగరేసి పట్టుకుని హరిప్రియ పలకరింపుకి వెనక్కి తిరిగి ఆమె పక్కనున్న నన్ను చూస్తూనే "అరె... మీరు వచ్చారే. చాలా సంతోషం ఈ రెండో గేమ్ కూడా గెలిచేస్తే అప్పుడు మేం విన్నర్స్ అయాం అనుకోవచ్చు. ఇంక ఒక్క గేమ్" కృష్ణ కబుర్లు చెపూతనేవుంది. ఇంతలో పిలుపు వచ్చింది. "రెండవ గేమ్ ప్రారంభించాం రండి త్వరగా" అని

కృష్ణ హుషారుగా కోర్టులోకి వెళ్ళింది రెండు టీములూ కోర్టు మార్పు చేసుకున్నారు. ఆట ప్రారంభమైంది. మొదటి గేమ్ పోయిందన్న అవమానంతోనూ యీ రెండవ గేమ్ అన్నా గెలిస్తేగానీ మళ్ళీ మూడో గేమ్‌కి అవకాశం వుండదు. ఆ ఛాన్సు అన్నా వుంచుకుంటే మూడో గేమ్‌లో కృష్ణప్రియ టీమ్‌ని వోడించితే తమ టీమ్ విన్నర్సు అవవచ్చునన్న వుద్దేశ్యంతో వనజాక్షి టీమ్ విజృంభించి ఆడేస్తూన్నారు. వనజాక్షి సెంటర్ ఆడే అమ్మాయి. కృష్ణప్రియ కొట్టే షాట్సుని అతి చాకచక్యంగా తిప్పికొట్టి పాయింట్సుని సంపాదిస్తోంది కృష్ణ మొదట కాస్త నిర్లక్ష్యంగా ఆడింది కానీ ఎదురువాళ్ళకి వరసగా పాయంట్సు వచ్చేస్తూండేసరికి ఖంగారు పడిపోయింది అంతే దీన్ని అవకాశంగా తీసుకున్నా కృష్ణ ఆట పాడుచేసేస్తోంది. ఫ్రంట్ ఆడే యిద్దరమ్మాయిలూ జాగ్రత్తగా ఆడినా ప్రయోజనం లేకపోయింది కృష్ణ టీమ్ రెండో గేమ్ వోడిపోయింది కృష్ణ ముఖం యెర్రగా కందిపోయింది కోపంతో తన టీమువాళ్ళమీద విరుచుకుపడింది. ఆవేశంతో బ్యాట్ విరిచేసింది.

"హరిప్రియ ధైర్యం చెప్తోంది. గాభరా పడకు. మూడో గేమ్‌కి ఛాన్సు వుందిగా కాస్త జాగ్రత్తగా ఆడు" అని అయినా కృష్ణ స్థిమిత పడలేకపోతోంది. హుషారు తెచ్చుకోలేకపోతోంది

నాకు జాలి ముంచుకువచ్చింది. ఇలాంటప్పుడు కృష్ణప్రియకే కాదు ఆ పరిస్థితిలోవున్న ఎవరికన్నా ఆవేదనగా వుంటుంది. అభిమానంగా వుంటుంది జయాపజయాలు దైవాధీనాలు అని తెల్సినా మనస్సు బాధపడకమానదు కృష్ణప్రియ దగ్గరగా వెళ్ళాను. భుజంమీద చెయ్యివేసి మెల్లగా నొక్కాను. కృష్ణ నా ముఖంలోకి ఓ క్షణం చూసి తల దించుకుంది.

'కృష్ణా' నా ఆత్మీయమైన పిలుపుకి ఆ అమ్మాయి కళ్ళలో నీళ్ళు తిరిగాయి క్షణం.

"చూడూ నువ్వు యిదివరకు ఎన్నో గేమ్‌లు ఆడవచ్చు. ఎందరినో వోడించవచ్చు బహుమతులు పుచ్చుకోవచ్చు. అయితే యీరోజు నీ ప్రత్యర్థులు కూడా సమర్థులే ఈ ఆటలో అనుభవం వున్నవాళ్ళే. నిజం చెప్పాలంటే నీకు సమానసము లతో పోటీ వచ్చింది అయినా ఒక గేమ్ గెలిచారు రెండోది పోయింది విజయాన్ని సాధించే అవకాశం యింకా వుంది. అయినా నువ్విలా బేలగా అయిపోయి ధైర్యం కోలుపోతే యెలా. నీ టీమ్‌లో మిగతావాళ్ళు అధైర్యపడి ఆట పాడుచేసే ప్రమాదం వుంది. చూడూ ఒక్క మాట, ఆట అన్న తర్వాత విజయం యిద్దరిలోనూ ఒకరినే వరిస్తుంది. ఎప్పుడూ సరిసమానులతో ఆడి వోడిపోయినా బాధపడకపోవటమే అసలైన ఆటగాడి (ప్లేయర్) లక్షణం ఇలా అని నిన్ను నిరుత్సాహపరచాలని కాదు నా వుద్దేశ్యం. వెళ్ళు. ఈసారి స్థైర్యంగా నిల్చి నీ చాకచక్యాన్ని ప్రదర్శించి చివరివరకూ ప్రయత్నించు తప్పక విజయం నిన్నే వరిస్తుంది. వూ... కోర్టులోకి అందరూ వచ్చారు. వెళ్ళు కృష్ణా".

కృష్ణ కళ్ళలో నీళ్ళు వుబికి వస్తూన్నా బలవంతంగా ఆపుకుంది. నా చేతిని తన చేతిలోకి తీసుకుని సున్నితంగా నొక్కింది.

"మీ మాటలకి నాకు పోయిన ధైర్యం వచ్చింది గెల్చినా ఓడినా యింక బాధపడను

వస్తాను. మీరు యింకా గేమ్ అయేవరకూ వుండండి''.

'అలాగే యిక్కడే వుంటాను.'

కృష్ణ మరో కొత్త బ్యాట్ పట్టుకుని ఓసారి దాన్ని చేత్తో చూసుకుని కోర్టులోకి నడిచింది. వెంటనే ఆట ప్రారంభమైంది ఇరువైపులవారూ జాగ్రత్తగా ఆడుతూన్నారు. బాల్ క్రిందపడటం లేదు పాయింట్ ఒక్కోటి రావటానికి చాలా టైము పడుతోంది. కృష్ణ మొదటినించీ ఆట జాగ్రత్తగా ఆడుతూ ముందే పాయింట్లని తెస్తోంది కృష్ణ హుషారు చూసి బ్యాక్‌న ఆడే యిద్దరమ్మాయిలూ హుషారు పుంజుకున్నారు కృష్ణ కోర్టు అంతా తనే అయి యుద్ధంలో వీరవిహారం చేస్తూన్న వీరవనితలా విజృంభిస్తోంది షాట్లు కొడుతోంది. ఆ అమ్మాయి కొట్టే ప్రతి షాటుకీ జనం 'గుడ్ షాట్ గుడ్ షాట్' అని అరుస్తూన్నారు. కృష్ణ టీముకి పాయింట్లు పెరుగుతూన్నకొద్దీ వనజాక్షి టీములో అమ్మాయిలు ఖంగారుపడి ఆట పాడుచేస్తూన్నారు వనజాక్షి యెంత ప్రయత్నించీ ప్రయోజనం లేకపోతోంది. గేమ్ చూస్తూన్న ప్రేక్షకులు ''స్కోర్ ప్లీస్. స్కోర్ ప్లీస్'' అని అరుస్తూన్నారు ఎంపైర్ గొంతు చించుకుని చెప్తూన్నాడు స్కోరు వివరాలు నేను ప్రాణం బిగపట్టుకుని చూస్తూన్నాను ఆటని కానీ మనస్సు వేగంగా అతివేగంగా గతంలోకి పరుగుతీసింది. ఎన్నో పాత జ్ఞాపకాలని తవ్వి పైకి తీసుకువచ్చింది. కాలేజీలో చదివే రోజులు. అవి ప్రతివాళ్ల జీవితాల్లోనూ బంగారురోజులు. ఆ రోజుల్లో జరిగే ఒక్క సంఘటన మధురంగ ఓ మధురస్మృతిలా మనస్సులో నిచ్చిపోతుంది. ఇలాంటి స్మృతులు ఒకటీ రెండూ ఇలా ఎన్నో మనస్సులో అట్టడుగున వుండి అవకాశం వచ్చినప్పుడు అప్పుడే జరిగినంత కొత్తగా కళ్లముందు కదులుతాయి. పెళ్లి అయి పిల్లలు పుట్టినా కొత్త జీవితంతో బాటు కాలప్రవాహంలో కొట్టుకుపోతూన్నా యిలా ఏదో ఓ సందర్భంగా గుర్తుకివచ్చి కాస్సేపు యదార్ధ పరిస్థితులని మరిచిపోయేలా చేస్తాయి.

''స్కోర్ ప్లీస్ . స్కోర్ ప్లీస్'' అన్న కేకలకి నేను గతంలోంచి వర్తమానంలోకి వచ్చాను. కృష్ణప్రియ ఒకసారి కోర్టు మారింది. (మూడో గేమ్‌లో ఇలా జరుగుతుంది.) 'స్కోర్ ప్లీస్' నేను ఆవేశంగా అరిచేశాను నా చుట్టూ వున్న అమ్మాయిలు ఆట చూడటం ఆపి నావైపు తెల్లబోయి చూశారు ఇప్పటికి నాకు వళ్లు తెలిసింది సిగ్గుపడిపోయి దిక్కులుచూస్తూ నిల్చున్నాను

'కృష్ణప్రియ టీమ్ నైన్‌టీన్''

''వనజాక్షి ఫైవ్‌ఫోటీన్'' ఆట సాగుతూ వుంది.

ఉన్నట్లుండి వనజాక్షి టీముకి పాయింట్లు ఎక్కువ వస్తూన్నాయి మళ్లీ జనంలోనించి గోలగా అరుపులు ఎంపైర్ గొంతు ఖంగ్‌న విన్పిస్తోంది.

గేంబాల్ ఆల్

## మధుర స్మృతి

అందరూ ప్రాణాలు బిగపట్టుకుని చూస్తూన్నారు బాల్ ఇటునుంచి అటూ అటునించి యిటూ వస్తోంది పోతోంది కృష్ణ బాల్‌ని పడగొట్టాలని షాట్ కొడుతోంది వనజాక్షి టీములో ఫ్రంట్ ఆడే అమ్మాయిలూ బాక్ ఆడే అమ్మాయిలూ ఎవరికి అవకాశం వచ్చినప్పుడు వాళ్లు ఆ షాట్‌లని తిప్పికొట్టేస్తూన్నారు వనజాక్షి టీములో అయిదుగురి సర్వీసులోనూ ఒక్క పాయింట్‌అన్నా రానీయకుండా కృష్ణ వాళ్ల హేండ్సుని డౌన్‌చేసి సర్వీసుని తను తీసుకుంది అంతే బాల్‌ని ఎగరేసి పట్టుకుని సర్వీసు చేసింది. వనజాక్షి తిప్పికొట్టింది కృష్ణ షాట్ కొట్టింది. అంతే బాల్ తిరిగిరాలేదు ''గేమ్ బాల్ . . కృష్ణప్రియా టీమ్...''

## హోరులో ఎడారి

ఈ తరానికి స్వరూపం లేదు గాలిలా
పర్యమాత్రమే వుంది హోరుతో ఎడారులను
ధ్వంసం చేస్తున్నట్టు
ఒక్క నాగటిపోటుతో భూమినే లొంగదీసుకునే
మనిషికి
రాజ్యాలు వంగి సలాం చేయక ఏంజేస్తాయి –
అక్కడ కుర్చీలో నువ్వు కూర్చున్నది
నువ్వు మమ్మల్ని శాసించడానికి కాదు
మాతో శాసించబడడానికి –
యిక్కడి ప్రజలు
హృదయాలను ఆకాశాలు చేసుకుని
ఆరేసుకున్నారు
ఆకాశంలోనుండి
అగ్నిపిడుగులే కావాలో
అమృతవర్షమే కావాలో
కోరుకో – నీ యిష్టం.

రామా చంద్రమౌళి

అంపైర్ అరుస్తూ ఆట కంటిన్యూ చేయిస్తూన్నాడు కృష్ణ మళ్లా సర్వీసు చేసింది అది తిరిగి వస్తోంది నెట్ దగ్గరకి విసురుగా వెళ్లి మరో షాట్ కొట్టింది. అంతే ఆ బాల్ క్రింద పడిపోయింది. 'గుడ్ షాట్! గుడ్ షాట్!' జనం చప్పట్లు చరిచారు

'కృష్ణప్రియ టీమ్ విన్నర్స్' అని చెప్పి ఎంపైర్ స్టూలు దిగేశాడు.

కృష్ణని స్నేహితులూ టీములోని మిగతా అమ్మాయిలూ ఎత్తేశారు సంతోషంలో అందరూ విజయగర్వంలో వుక్కిరివుక్కిరి అవుతూన్నారు ఆ సంతోషంలో అందరూ నన్ను వెనక్కి నెట్టేశారు.

అయిదు నిమిషాల్లోనే కృష్ణ నన్ను వెతుక్కుంటూ వచ్చింది.

''కంగ్రాజులేషన్స్ కృష్ణప్రియా!'' అన్నాను

''థాంక్స్. మీరు నా ఆట చూడటానికి రావటమేకాక సరైన సమయంలో ధైర్యం నూరిపోసి నిలబెట్టారు. ఇందువల్లనే నేను విజయం సాధించగలిగాను అనుకుంటున్నాను ఈరోజున ఈ మాచ్‌నీ మిమ్మల్నీ జీవితంలో మర్చిపోలేను. ఇది నాలో మధురస్మృతిలా నిలిచిపోతుంది ఎప్పటికీ నిత్యనూతనంగా''.

''నన్ను మునగచెట్టు ఎక్కించేయకుగానీ నీ పార్ట్‌నర్సుని పరిచయం చెయ్యి''

కృష్ణ మిగతా నలుగురమ్మాయిలనీ పరిచయం చేస్తూండగా అందులో ఓ అమ్మాయి నా ముఖంలోకి పరిశీలనగా చూస్తూ –

''మీరు .. మీరు గీతాదేవిగారు కదూ!'' అంది అమాంతం వచ్చి చెయ్యి గట్టిగా పట్టుకుని.

''అవును నేను మీకెలా తెల్సు?''

''మీరు నాలుగు సంవత్సరాలక్రితం మావూరికి బాల్‌బాడ్మింటన్ టోర్నమెంట్‌కి వచ్చారుకదూ మీరు మీ టీముకి కెప్టెన్‌కదూ. ఫైవ్స్‌లో సెంటర్ ఆడేవారుకదూ. ఆరోజుల్లో మీ గేమ్స్‌కి వచ్చి ప్రతిరోజూ చూసేదాన్ని. కృష్ణప్రియా! ఈవిడ ఇదివరకు బెస్ట్ ప్లేయర్ అద్భుతంగా ఆడేవారు. ఈవిడముందు మనం పనికిరాం'' అంది

''నిజంగానా!'' కృష్ణ నావైపు ఆరాధనా భావంతో చూసింది.

నేను కృష్ణని మొట్టమొదటిసారి అచ్చంగా ఇలానే చూసివుంటాను అనుకున్నాను.

''ఈ విషయం మీరు నాకెందుకు చెప్పలేదు.''

''నాకైనా ఎప్పుడూ చెప్పలేదే.'' అని హరిప్రియా, కృష్ణప్రియా నిష్ఠూరంగా అంటూన్నారు. చిరునవ్వు నవ్వేశాను

''అవన్నీ పాతరోజుల్లో ఇప్పుడు కాదుగా!'' అంటూ వాచీ చూసుకున్నాను

''అరె! చాలా టైము అయింది మరి వెళ్లివస్తాను.'' అంటూ అందరి దగ్గరా శలవు తీసుకుని స్టేడియం బైటకి వచ్చేసి ఆటో ఎక్కేశాను. కృష్ణ అంతవరకూ నా వెంటనే వచ్చింది.

''బహుమతులు మరో గంటలో యిస్తారు. అవి తీసుకుని వచ్చేస్తాను. మీరూ కాస్త వుండకూడదూ?'' అంది.

''లాభంలేదమ్మా! వెళ్లిపోవాలి. వస్తాను.'' కృష్ణ వెనక్కి ఆగిపోయింది ఆటో బైలుదేరింది వేగంగా పోతోంది. నా మనస్సు మళ్లా గతంలోకి పరుగుతీసింది. టోర్నమెంట్ అయిన తర్వాత మీటింగ్. పెద్దలు వచ్చి పూవులదండలు వేయించుకుని తోచిన విషయాలు చెప్పి ఆటలాడే వాళ్లు యెలా వుండాలో జయాపజయాలని ఎంత తేలిగ్గా తీసుకోవాలో అందంగా చెప్పి గెల్చినవారికి కప్పులు అందిస్తూ ఫొటోగ్రాఫర్లకి పోజులిస్తూ వుండగా జనంలోనించి కరతాళధ్వనులు మిన్నుముడుతూవుండగా అమ్మాయిలు కప్పులు తీసుకుని స్టేజీమీదనించి దిగుతూ అనుకుంటారు– జీవితం అంతా యిలా సాగిపోతే యెంత బాగుండు అని. కాని యిది సాధ్యమా!

# మీ పాపాయికి బుద్ధి చెప్పినట్లే ఆ జలుబుకూ స్వస్తి చెప్పండి. మందలించండి, ముద్దుచేయండి.




## రబెక్స్

**అంతా మీ ధోరణిగలదే! జలుబుపై ఓ దెబ్బవేసి ముద్దుగా దూరం చేస్తుంది. ఆపైన మీ పాపాయికి ఉపశమనం, హాయి...**

## రబెక్స్

రబెక్స్‌లోని జలుబు నుండి ఉపశమనాన్ని కలిగించే విశ్వసనీయమైన ఆరు ఔషధాలు (మెంథాల్, కేంఫర్, థైమాల్, టర్పెంటైన్, యూకలిప్టస ఆయిల్, నట్‌మెగ్ ఆయిల్), మీరు అతని ముక్కుపై, గొంతుకపై, ఛాతీపై, వీపుపై రాయగానే వేడి హాయిని వ్యాపింప చేసి ఉపశమనాన్ని కలిగిస్తాయి. రబెక్స్ త్వరలోనే అతని ముక్కు దిబ్బడను, ఛాతిలో బిగువును పోగొట్టి హాయిగా ఊపిరి పీల్చుకునేందుకు తోడ్పడుతుంది. మీతోనూ, రబెక్స్‌తోనూ మీ పాపాయిలో నవ్వులు కోకొల్లలు...త్వరలోనే.

మంటగానీ, అంటుకు పోవడంగానీ లేకుండా జలుబుల నుండి ఉపశమనాన్ని కలిగించే శక్తివంతమైన మలాము.

గ్లైకోడిన్ వంటి అధునాతనమైన మందులను తయారుచేసే Alembic అలెంబిక్ ఉత్పాదన

everest/665/ACW-



ం—ం—ం—ం—ం—ం—ం—ం 'సూర్య చంద్రులు'లో లత, చంద్రమోహన్ ం—ం—ం—ం—ం—ం—ం—ం

# "సెక్సువేవ్" జోరు

చాలా రోజులుగా అనుకుంటున్నాను యీ మధ్య యమర్జన్సీ వచ్చిన తర్వాత నిస్సారమై పోయిన సినిమాలు, అత్యవసర పరిస్థితి తొలగి పోయింతరువాత బరి తెగించి పోతున్నట్లు జనాలు ఎదే పదే చెప్పుకుంటున్నారని — దాని గురించి ఆలోచించు కోవలసిన అవసరం సినిమా యిండస్ట్రీకి వుందని చెప్పాలనుంది

అత్యవసర పరిస్థితిలో సెన్సారు వాళ్ళకు — మొహమాటలు పడటానికి వీలులేని స్థితిలో — సినిమా నిర్మాతలు "క్రయిమ్" చిత్రాలకి — ఆడదాన్ని భీభత్సంచేసే సన్నివేశాలని చూపెట్టడానికి స్వస్తి చెప్పక తప్పలేదు కాని దేశాన్ని ఆవరించిన యీ చీకటి అంతరించి పోగానే — ఒక్కసారి మన తెలుగు సినిమా వాళ్ళకి ఎన్నాళ్ళ గానో కాళ్ళూ చేతులు కట్టుకూర్చున్నట్లుయింది! — ఒక్కసారి విజృంభించారు

## ఒకే మూసకి అలవాటు

మొదటినుంచీ మన నిర్మాతలకి యిండస్ట్రీలోని పెద్దలకి— ఒకే'మూస' చిత్రాలు అలవాటై పోయాయి — ఒక చిత్రం బజారులో బాగాపోయి గల్లాపెట్టి నిండిందంటే చాలు యిక అదే ఫార్ములాని — "చూడు నీ కన్నా — నేను బాగా చేశానన్నట్లు కాపీ చేసి మరో నిర్మాత, మరో హీరోతో లాగిపారేస్తాడు!

నేరం, స్టంటు, లాంటివి చూసి చూసి బోరెత్తి పోయిన ప్రేక్షకులకి సున్నితమైన భావస్ఫోరకమైన ఉదాత్తమైన సన్నివేశాలున్న చిత్రాలని తీసి చూపించగల ధైర్యం లేక మన నిర్మాతలు యీ మధ్య వరుసగా, భారీ రంగుల చిత్రాలను సెక్సు గుప్పించి లాగి దేశం మీదకి వదులుతున్నారు

## అతిగా మొరటుతనం

మొరటుతనం యిదివరకు కేవలం విలన్‌కి మాత్రమే పరిమితం కాని మొరటుతనం యిప్పుడు — ఒక కాలేజీ అమ్మాయి యీ మధ్య వ్యాఖ్యానించినట్లు — "హీరో, విలన్ లిద్దరికి ఎక్కువ కావడంతో హీరోయిన్ వేషం వేసిన అమ్మాయికి "డబుల్‌డోస్" ఆటవిక ప్రేమ భరించవలసి వచ్చి ఎముకలు విరిగిపోతున్నాయి! హీరోతో కూడా రేప్ సీను లుంటున్నాయి

జానపద గీతాలను తీసుకుని వాటికి తెనుగులో చెప్పాలంటే "వల్గారిటీ" టచ్ — ఓవర్ డోసుతో యిచ్చి విచ్చలవిడిగా శృంగార సన్నివేశాలను చూపిస్తున్నాయి మన యిటీవలి భారీ వర్ణ చిత్రాలు— సినిమాకు వున్న "కళ" అన్న పేరుని అపహాస్యం చేస్తున్నట్లు ఎంతోమంది స్త్రీలు — సీరియల్ కథలు చదువుతారు యింకేంరాదు వాళ్ళకి— అని అంతా అంటూవుంటారే అటువంటి స్త్రీలు కూడా గట్టిగా అనుకుంటున్నారు

ఆడదాన్ని ఆటబొమ్మగా కథావస్తువులో చూపించడం ఎక్స్ప్లాయిట్ చేయటం అలవాటయింది యివాళ సినిమాలలో— ఆడదాన్ని అంటే జయమాలినిగానో, జ్యోతిలక్ష్మిగానో, క్యాబ్రేడ్యాన్సు చేస్తున్నట్లు చూపించి సెక్సు నంతా అందులో గుప్పించేవి చాలా రోజులుదాకా మన సినిమాలు— ఇక్కడ రెండర్థాలు పాటలు మానేసి కేవలం అశ్లీల పదజాలంతోనే పాటలను పాడించేస్తున్నారు యిప్పుడు

ఇప్పుడు యీ దశ కూడా దాటి పవిత్రంగా ప్రేమించుకునే హీరో హీరోయిన్‌లు కూడా ప్రేమ పరిపక్వ దశకి రాకుండానే తొలి దశలోనే — పడక గది కూడా వెతుక్కోడం మానేసి — పబ్లిక్ పార్కులను, తోటలను, తమ కోసం శోభనం గదులుగా వాడుకుంటున్నారని ఎంతమంది సభ్య ప్రేక్షకులు గోల చేస్తున్నారో ?— యింకా ఒక్కటి రెండు నెలల్లో విడుదలయ్యే యిటువంటి భారీ చిత్రాలు గల్లాపెట్టె దగ్గిర దెబ్బతింటే తప్ప తెలియదు — అని ఒక మధ్య తరగతి ప్రేక్షకుడు వాపోయాడు —

## డ్యూయట్ అంటే భయం !

ఒక ప్రక్క యీ మాదిరి తిమ్మిరి పాటలు, మద్దెల పాటలు — కేవలం రికార్డింగు డ్యాన్సుల్లో పాడేటందుకు పనికివచ్చే అమ్యూజిమెంటు పార్క్ స్థాయి పాటలు గల చిత్రాలను తయారు చేస్తున్నారు —

ఈ మధ్యనే ఒక యువతి యిటువంటి



## హాని ~~~~~~~~

సినిమాకి స్నేహితురాండ్రతో పోయివస్తూ — "అబ్బ! యీ సినిమాలో డ్యూయట్ పాట వస్తుందంటే నా గుండెల్లో దడ పట్టుకుంటుందే— ఆ హీరో ఆ హీరోయిన్‌ని మరుక్షణంలో తెరమీద యింకా ఘోరంగా ఏమైనా చేస్తాడేమోనని — హడిలి చచ్చిపోయి — కళ్ళు మూసేసుకున్నానే వాలాసార్లు" అని స్నేహితురాండ్రతో అనడం — నేను విన్నాను

సినిమాల్లో శృంగారం వద్దని హీరో హీరోయిన్ వేషాలు కట్టేవాళ్ళు — వాళ్ళ కిష్టమై గట్టిగా ఒకర్ని ఒకరు హత్తుకుపోతే దానివల్ల భారతీయ సంప్రదాయం చెడిపోతుందని అనేటంత అమాయకు లెవరూ లేరు యివాళ కాని మోతాదు మించి. వెకిలి శృంగార బంధాలు సాడిస్టిక్ సెక్స్ పెర్వర్షన్స్ — ఆడదాన్ని సెక్సుపరంగా హింసించడాన్ని ప్రోత్సహించే సన్నివేశాలు సృష్టించి యివి పవిత్ర ప్రేమికులు తొ. దశలో చేసే చి.పి పనులు అనడం—ఏడాదికి 70సినిమాలు తీస్తూ - దేశంలో సంఖ్యాపరంగా ద్వితీయ స్థానంలో వున్న మన చిత్ర పరిశ్రమకి ఎంత మాత్రం శోభ నివ్వదు —'అవార్డులు మాకెందుకు రావు? అని ప్రశ్నించే ముందు — చిత్రాలలో మన స్త్రీ పురుషుల మధ్య పెంపొందించి పరిపోషించి చూపించే సామాజిక బంధం సంబంధం ఎటువంటివి? అని ఆలోచించడం హీరోలైనా చేయవచ్చును — ఎందుకంటే నిర్మాతలు వాళ్ళ మాట వింటారు కనుక

తెలుగు సెన్సార్ బోర్డువారు యమర్జన్సీ లాంటి దుస్థితిలో తప్ప సినిమాల ఉత్తమాభిరుచిని తాము కాపాడే స్థితిలో లేరు — అన్న మాటలు యీమధ్య పదే పదే ఋజువు చేసుకుంటున్నారు — సెన్సార్ సభ్యులందరూకూడా తాము సర్టిఫికేట్ యిచ్చిన సినిమాలకి తమ కుటుంబాలతో వెళ్లరా? — అని ఒక యిల్లాలు యీ మధ్యనే వ్యాఖ్యానించడం సినిమాహాల్లో ముందు వరసలో కూర్చుని వుండగా వినపడ్డది

"క్రెయిమ్ వేవ్"లాగే యీ "సెక్సు వేవ్" కూడా మన తెలుగు సినిమాలని త్వరలో వదిలిపెడుతుందన్న ఆశ కొంత మందిలోనైనా వుంది సెన్సార్ బోర్డువారు ముఖ్యంగా యిది దృష్టిలో పెట్టుకుంటే నిర్మాతలు పెద్ద హీరోలు తప్పకుండా — కొత్త మాదిరి చిత్రీకరణకి పూనుకుంటారు— మన కవులు ఏది రాయమన్నా రాయగల సమర్థులే కనుక — మంచి పాటలు వ్రాసి కూడా రాణిస్తారు— అనుమానంలేదు—

మనకి ఎంతసేపూ ఉత్తమ చిత్రాలుగా కనపడేవి —మల్లీశ్వరి— అందులో పాట ..— పాత పోతం అందులో పాటలు అవడం విచారకరం - మరీ అంత గత కీర్తి మీద యింత పెద్ద యిండస్ట్రీ బ్రతకాలను కోకూడదు— నిర్మాతలు దర్శకులు— రచయితలు— హీరోలు ఒకచోట కలిసి కూర్చుని— కొత్త మార్గాలకు పోయి సినిమాను నాలుగుడబ్బులు ఆర్జించే 'కళ'గా మళ్లీ రూపొందించే యత్నం చేయాలి— లేకపోతే — అమ్యూజ్‌మెంట్ పార్క్‌ల వాళ్ళు మా డేరాలలో ప్రదర్శనలు ఎందుకు రైడ్‌చేసి నిషేధిస్తున్నారు? — మీరు యిటువంటి సినిమాలకి ప్రదర్శన అవకాశాలు ఎందుకు యిస్తున్నారు? అంటూ గొడవచేసే స్థితి కూడా వస్తుంది' అని "చిన్న చిన్న యిష్టగోష్ఠులలో" కల్చర్ క్లబ్స్ మీటింగులలోను కొంతమంది అనుకుంటున్నారు నిర్మాతలు హీరోలు— హీరోయిన్‌లు బాగా ఆలోచించుకోవాలి మరి [వీరాజీ]



()-()-()-()-()-()-() 'మేలు కొలుపు'లో హాలం, చలం ()-()-()-()-()-()-()



## ఎన్. టి. ఆర్, ఎ. ఎన్. ఆర్. ల తుఫాన్ విరాళ కార్యక్రమం

ఆంధ్రదేశంలో తుఫానుకు గురియైన వారి కుటుంబాల సహాయార్థం తెలుగు చలన చిత్ర పరిశ్రమ ప్రముఖ నటులు ఎన్ టి రామారావు, అక్కినేని నాగేశ్వరరావులు మరి కొంతమంది కళాకారులు, సాంకేతిక నిపుణులను తీసుకొని డిసెంబరు 14 నుంచి తొమ్మిది రోజులపాటు ముఖ్యమైన పట్టణాలలో పర్యటించటానికి నిర్ణయించారు వారు పాలంతా బిక్షాటన ద్వారాను, సాయంత్రం సాంస్కృతిక ప్రదర్శనల ద్వారాను తుఫాను బాధితుల సహాయ నిధిని సేకరిస్తారు ఈ కళాకారుల బృందం డిసెంబరు 14న తిరుపతి, 15న కడప, 16న కర్నూలు, 17న హైదరాబాదు, 18న వరంగల్, 19న ఖమ్మం, 20న రాజమండ్రి, 21న వైజాగ్, 22న కాకినాడ పట్టణాలలో పర్యటన జరుపుతున్నది ఈలోగా ఈ నిధికి చెరి పది వేలు వ్యక్తిగత విరాళంగా ఇస్తున్నట్లు ఎన్ టి ఆర్, ఎ ఎన్ ఆర్ లు విజయవాడలో ప్రకటించారు ★

## పాకిస్తాన్‌లో మన పాత సినిమా పాటల మోజు

భారతీయ చిత్రాలలో పాతకాలంలో ఖుర్షీద్, గీతాబాలి, లతామంగేష్కర్ మొదలైనవాళ్లు పాడిన పాటలమీద విపరీతంగా మోజున్న పాకిస్తాన్ ప్రేక్షకులు శ్రోతలు ఎక్కువగా ఢిల్లీ రేడియో, సిలన్ రేడియోలనే వినడంతో పాకిస్తాన్ ప్రభుత్వం కొత్త యోచన చేసింది. ఈ హిందీ పాత పాటలను అక్కడ గల పాకిస్తాన్ గాయనీ గాయకుల చేత పాడించి వాటిని రేడియోలో వినిపించాలని యత్నిస్తున్నారు. దీనివలన వారికి — కాపీరైటు సమస్య రాకుండా గ్రామఫోను కంపెనీలతో చర్చలు జరుగుతున్నాయి.

★★★

మద్రాసు సినిమా విశేషాలు సకాలంలో అందవందువల్ల ఈ సంచికలో వేయలేకపోతున్నాము —సం.



'ప్రయాణంలో పదనిసలు' లో నాగేష్, పద్మనాభం

## నిర్మాత రామానాయుడు విరాళం

సుప్రసిద్ధ చలనచిత్ర నిర్మాత శ్రీ డి రామానాయుడు ఇటీవల తుఫాను భీభత్సములో నష్టపడిన బాధితుల సహాయార్థం ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారికి 20 వేల రూపాయల చెక్కును అందజేసారు అలాగే తమిళనాడులో సంభవించినందున తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ యం జి రామచంద్రన్ గారికి 5 వేల రూపాయలు ఇచ్చినారు ప్రజామోదం పొందిన వారి చిత్రాలు 'ప్రేమనగర్, సోగ్గాడు, సావాసగాళ్లు' విజయవాడ అలంకార్‌లో ఈ నెల 2వ తేదీ నుండి 7వ తేదీ వరకు ప్రదర్శించి అందులో వారి వాటాకు వచ్చే మొత్తం 'తుఫాను బాధితుల నిధికి' యిస్తున్నారు డిసెంబర్ రెండవ వారంలో వారి తాజా చిత్రం 'మొరటోడు' ఢిల్లీలో రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డిగారు ముఖ్య అతిథిగా ప్రత్యేక ప్రదర్శన ఏర్పాటు చేసి అందు వచ్చే వసూలు మొత్తం తుఫాను బాధితులకు యివ్వగలమన్నారు

## శాంతారాం ట్రస్టు

ప్రముఖ నిర్మాత, నటుడు, దర్శకుడు వి శాంతారాం తన 75వ పుట్టినరోజునాడు — ఒక పబ్లిక్ ట్రస్టును ఏర్పాటు చేశాడు తన ఆదాయాన్ని ఆస్తిని దానిలో పెట్టాడు సినిమా అభివృద్ధికి యీ ట్రస్టు కృషి చేస్తుందని ప్రకటించాడు ★★★

'నా ప్రాణంలో ప్రాణం' లో శోభన్‌బాబు, దీప



# జి. వి. జి. పేజీ

### స్వర్గ్ - నరక్

దాసరి నారాయణరావు దర్శకత్వంలో శ్రీ బి నాగిరెడ్డి నిర్మించే విజయావారి ''స్వర్గం నరకం'' హిందీ చిత్రం షూటింగ్ జనవరి 4న సెట్స్‌కు వెళ్తుంది హీరోగా జితేంద్ర, విలన్‌గా వినోద్‌మెహ్రా, దాసరి పాత్రను సంజీవ్‌కుమార్ నిర్వహించవచ్చు

### టెలివిషన్ ప్రభావం!

''టెలివిషన్ ధాటికి తట్టుకోలేక హాలీవుడ్‌లో కూడా కొన్ని ఫిలిమ్ స్టుడియోలు మూతపడ్డాయి తక్కువ బడ్జెట్‌లో చిత్రాలు తీయాలనే నిర్ణయానికి వాళ్ళుకూడా రాక తప్పిందికాదు'' అని ఇటీవల అమెరికాలో చలనచిత్ర పరిశ్రమ పరిస్థితులను కుణ్ణంగా పరిశీలించివచ్చిన విఖ్యాత నిర్మాత శ్రీ దుక్కిపాటి మధుసూదనరావు మద్రాసులో ఏర్పాటు చేసిన పాత్రికేయుల సమావేశంలో అన్నారు ''టవరింగ్ ఇన్‌ఫెర్నో, ది గాడ్ ఫాదర్, జాస్'' అక్కడ సూపర్ హిట్ అయి సంచలనం

[32వ పేజీ చూడండి]

# తుఫాన్ బాధితులకు విరాళాలు సినీ నటుల ఊరేగింపు

తుఫాను బాధితుల కోసం విరాళాలు సేకరించడానికిగాను తెలుగు సినీ నటులు రాజధానిలో గత నెల 29న ఊరేగింపు జరిపారు రు.50వేల దాకా వసూలు చేశారని తెలిసింది.

చార్మినార్ వద్ద ఊరేగింపు బయలుదేరింది జగ్గయ్య, ప్రభాకరరెడ్డి, ఎలం, రాజబాబు, ఊరెగింపులో పాల్గొన్నారు

చార్మినార్ నుంచి పత్తర్‌ఘట్టి, మదీనా, అఫ్ జుల్‌గంజి, సిద్ధియంబర్ బజార్, ఉస్మాన్ గంజి మోజంజాహి మార్కెట్, జాంబాగ్, పుల్లిబవులి, కోటి, సుల్తాన్ బజార్, అబిద్, నాంపల్లి, పబ్లిక్ గార్డెన్స్ మీదుగా ఊరేగింపు ఇండోర్ స్టేడియంకు చేరుకుంది

జనం తారల ఊరేగింపును చూడటానికి విపరీతంగా గుమికూడారు. ప్రత్యేకంగా విరాళాలు జల్లారు. అయితే ముందు ప్రకటింపబడినట్టు ఈ ఊరేగింపులో శోభన్ బాబు, జయసుధ, జయచిత్ర, మురళీమోహన్, కృష్ణంరాజు ప్రభృతులు పాల్గొనలేదు దీనితో జనం కొంత నిరుత్సాహపడ్డారు జాబితాలో కనిపించిన తారలంతా కనిపించనప్పటికి రాజబాబు చేసిన హడావుడివల్ల జనం ఉత్సాహంతో ముందుకు వచ్చి యధాశక్తి విరాళాలిచ్చారు. ఉదయం బయలుదేరేచోటే రెండు మూడు గంటలు ఆలస్యం అయింది. త్రోవ పొడుగునా జనం విపరీతంగా గుమిగూడటంతో గమ్యం చేరడం మరింత ఆలస్యమైంది. [ఆం. ప నుంచి] *

## రౌడీ రంగమ్మ

విజయనిర్మల రౌడీ రంగమ్మగా ప్రేక్షకుల ముందుకు రానున్నది. రౌడీ రంగమ్మకి ఆధారం ''రౌడీ రక్కమ్మ'' తమిళ చిత్రం. ప్రసాద్ స్టూడియోలో నవంబర్ ఆరునుంచి ఆరంభమైన యీ సినిమాలో జయంతి, రంగనాథ్‌లు కూడా వున్నారు. 'రంగమ్మ'గా తనని తానే డైరెక్టు చేసుకుంటూ విజయనిర్మల యీ రౌడీ అమ్మాయి చిత్రానికి స్క్రీన్‌ప్లే కూడా తానే వ్రాసుకున్నది

## శత్రుఘన్ సిన్హా

విలన్‌గా వచ్చి హీరోగా మారిన శత్రుఘ్నసిన్హా యీ మధ్య విపరీతంగా సినిమాలలో బుక్ ఐపోతున్నాడు. అతను కూడా పెద్ద తారలు యిద్దరు ముగ్గురు నటించే చిత్రాలలో నటిస్తున్నాడు అమితాబ్, ధర్మేంద్ర, సంజీవకుమార్‌ల 'షోలే' హిట్ కావటంతో హిందీ నిర్మాతలకి యీ రకాల సినిమాల పిచ్చి ఎక్కువైంది సునిల్‌దత్, సంజీవకుమార్, శత్రుఘ్నసిన్హాలు యిప్పుడు కలసి నటిస్తున్న సినిమా ''జానీ దుష్మన్''లో కూడా కావలసిన మిర్చిమసాలా పెడుతున్నారు — ఇలాంటి కదంబ కార్యక్రమాలు బాగా పోతాయని నిర్మాతల ఆశ



కలిగించిన పెద్ద బడ్జెట్ చిత్రాలు. కాని, ఆ తర్వాత అదే ప్రమాణంలో తీసిన ''గాడ్ ఫాదర్ నెంబర్ 2'' ఆశించినంత బాగా పోకపోవడంతో హాలివుడ్‌లో సైతం ఈ నిర్ణయానికి రావడంలో విచిత్రమేమీ లేదు కొత్త నాయికా నాయకులతో తక్కువ బడ్జెట్‌లో తీసిన ''ది లవ్ స్టోరీ'' చిత్రం ఖండ ఖండాంతరాలలో అఖండ విజయాన్ని సాధించ డానికి కారణం స్క్రిప్టు విషయంలో తీసుకోబడిన శ్రద్ధే అన్న విషయం అందరికీ విదితమే

### సినీ నటి బస్సు ప్రయాణం!

హిందీ చిత్రాలలో నటిస్తూన్న ఒక తెలుగు యువతి స్వస్థలం ఒక పుణ్యక్షేత్రం కాగా ఆమె పేరులో మరో పుణ్యక్షేత్రముంది. ఆమె తాళ్ళూరి రామేశ్వరి అని ఈపాటికి పాఠకులు పసికట్టేసి వుంటారు యువచిత్ర వారి ''సీతామాలక్ష్మి'' చిత్రానికి ఆమె చిత్తూరు ప్రాంతంలో ఔట్‌డోర్ షూటింగ్‌లో పాల్గొన్నాక ఒక్కోసారి బస్సులోనే తిరుపతికి వెళ్ళివస్తూండేది ''నన్ను ఎవరు గుర్తుపడ్తారులెండి'' అనేదామె కాని, ''సీతామాలక్ష్మి'' చిత్రం విడుదలయ్యాక ఉమె యిక అలా బస్సులో ప్రయాణం చేయగలదా?

### చిత్రాల రాబడి తగ్గుదల

తుఫాను భీభత్సం మూలంగా వచ్చే రెండు మూడు మాసాల్లో చిత్రాల వసూళ్ళకు కాస్త దెబ్బతగిలే ప్రమాద ముండవచ్చు గనుక నిర్మాతలు పోటీలుపడి చిత్రాలు విడుదల చేయకపోవచ్చని కొందరి అభిప్రాయం

### పట్నవాసం షూటింగ్ పూర్తి

నవంబర్ 12 నుండి 16 వరకు జరిగిన చిత్రీకరణతో కృష్ణ సమర్పించే పద్మాలయ పిక్చర్స్ వారి ''పట్నవాసం'' వర్ణ చిత్రం షూటింగ్ పూర్తయిందని నిర్మాత జి. హనుమంత రావు తెలియజేశారు. జి ఆదిశేషగిరిరావు నిర్వహణలో తయారైన యీ చిత్రానికి పి చంద్రశేఖరరెడ్డి దర్శకత్వం నెరపారు. కృష్ణ, విజయనిర్మల, శ్రీప్రియ, కృష్ణకుమారి, రమాప్రభ, కె. విజయ, రాధాకుమారి, సత్యనారాయణ, కాంతారావు, నాగభూషణం, రాజ్‌బాబు, త్యాగరాజు, గిరిబాబు, సాక్షిరంగా రావు, కాకరాల మున్నగువారు పాల్గొన్నారు కథ — మాటలను రాజశ్రీ, గీతాలను కొసరాజు, రాజశ్రీ రాశారు జె. వి. రాఘవులు సంగీత దర్శకుడు పుష్పాల గోపీకృష్ణ ఛాయాగ్రాహకుడు శిల్పం కె రామలింగేశ్వరరావు, కూర్పు కోటగిరి గోపాలరావు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ జి. సత్యరాజు సంక్రాంతి విడుదల

### నిర్మాతగా డిస్ట్రిబ్యూటర్

జి. వి. కృష్ణారావు (నవభారత్ బాబూరావు), బాలాజీ ఇంటర్నేషనల్ పతాకంలో ఎం మల్లికార్జునరావు దర్శకత్వంలో నిర్మించే వర్ణ చిత్రానికి నవంబర్ 17న పాటల రికార్డింగ్‌తో ప్రారంభోత్సవం జరిగింది మురళీ మోహన్, సత్యనారాయణ, బాలయ్య, శరత్‌బాబు, నరసింహరాజు, జయలక్ష్మి, నిర్మల మున్నగువారు పాల్గొనే ఈ చిత్రానికి టి. పి మహారథి సంభాషణలు, జె. వి రాఘవులు సంగీతం, సి. నారాయణరెడ్డి గీతాలు, లక్ష్మణ్ గోరే ఛాయాగ్రహణం, కె. రామలింగేశ్వరరావు శిల్పం, కోటగిరి గోపాలరావు కూర్పు, చంద్రమౌళి నిర్వహణ బాధ్యతలు స్వీకరించారు డిసెంబర్ రెండవవారంలో తిరుపతి పరిసర ప్రాంతాలలో షూటింగ్ ప్రారంభం



# జి. వి. జి. పేజీ

### లంబాడోళ్ళ రాందాసు

రాందాసు ఇంటి నౌఖరే అయినా – రమాపతి, అన్నపూర్ణలు అతన్ని బిడ్డలా చూసుకున్నారు. కాని, అతన్ని ఆ రమాపతి కూడా వెలివేశాడు. కారణం – అతను లంబాడీ గూడెంలో వుండే ఆ తండా నాయకుడు సింగన్న కూతురు చుక్కిని పెళ్ళాడడమే. ఆ పెళ్ళి చూసివచ్చిన రమాపతి మనోవ్యధ చెందుతూండగా ఆయన భార్య అన్నపూర్ణ "వాడు శుభమా అని పెళ్ళి చేసుకుంటే ఇదేమిటండీ ?" అంది.

"చిన్నప్పట్నించీ పాలేరుగా కాకుండా బిడ్డలా మన ఇంట్లో పెరిగాడు. నా మాట కాదని లంబాడీవాళ్ళతో కలిశాడు. వొద్దురా అంటే లంబాడీ పిల్లను పెళ్ళి చేసుకున్నాడు. పదిమందిలో ఎదురుతిరిగి నన్నవమానించాడు. ఇక నా అవసరం వాడికి రాదు. వాడికి మనమేం కాదు. వాడు... వాడు..." అంటూంటే రమాపతి గొంతు పూడిపోయింది.

"ఎందుకండీ అంత బాధపడతారు ?" అని భార్య అడిగింది.

"నా బాధ నీకు తెలియదు, అన్నపూర్ణా! చెప్తాను. నీకంతా చెప్తాను... ఆ రాందాసు –" అని ఆయన అసలు రహస్యం వెల్లడించబోయేంతలో రాందాసు, చుక్కి పెళ్ళిబట్టలతోనే అక్కడికి వచ్చారు.

"రమాపతి మనసులోని మాట ఏమిటో, అది వెల్లడిస్తే ఎవరికి నష్టమో మా లంబాడోళ్ళ రాందాసు చిత్రం చూస్తేగాని మీకు తెలీదు" అన్నారు డైరెక్టర్ కె. బాబూరావు.

కె. ఎ. ప్రభాకర్ నిర్మించిన ఈ ఈస్ట్‌మన్ కలర్ చిత్రంలో చలం, జగ్గయ్య, నరసింహరాజు, రావు గోపాలరావు, ప్రభాకర రెడ్డి, అల్లు రామలింగయ్య, మిక్కిలినేని, మాడా, సీతారాం, సి.హెచ్. కృష్ణమూర్తి, అర్జా జనార్ధనరావు, కె. జగ్గారావు, బి. ఆదిబాబు, రోజారమణి, జయలక్ష్మి, కె. విజయ, పండరీబాయి, జి. నిర్మల, శ్యామల, సుజాత, జూనియర్ భానుమతి, హేమ, వరలక్ష్మి, పద్మ, కుమారి, హాస్య పాత్రల్లో రాజ్‌బాబు, బాలకృష్ణ, కె. వి. చలం, చిట్టిబాబు పాల్గొన్నారు. డాక్టర్ కొర్రపాటి గంగాధరరావు మూల కథకు పినిసెట్టి సంభాషణలు రాశారు. గీతాలు : సి. నారాయణరెడ్డి, ఆరుద్ర, కొసరాజు. సంగీతం : ఎస్. రాజేశ్వరరావు. నృత్యాలు : రాజు శేషు. కూర్పు : కల్యాణ సుందరం. స్థిర చిత్రాలు : మోహన్‌జీ జగన్.

### మరో సీత కథ

"లక్ష్మణరేఖ, స్వర్గానికి నిచ్చెనలు" చిత్ర దర్శకుడు ఎన్. గోపాలకృష్ణ, బి. ఎస్‌సి. దర్శకత్వంలో చిత్తూరు పి. ఎం. షణ్ముగం నిర్మించే పి. ఎమ్. ఎస్. ప్రొడక్షన్స్ "మరో సీత కథ" చిత్రానికి నవంబర్ 27 ఉదయం ఎ.వి.ఎస్. (శారదా)స్టూడియోస్‌లో శ్రీ బి. నాగిరెడ్డి కెమెరా స్విచ్ ఆన్ చేయడంతో ప్రారంభోత్సవం జరిగింది.

### సినిమాల ప్రభావం

"అమర్ అక్బర్ ఆంథోనీ" దిగ్విజయాన్ని పురస్కరించుకొని అముల్ కంపెనీవారు మన దేశంలో అక్కడక్కడ "అముల్, అక్బర్, ఆంథోనీ" అనే హోర్డింగ్స్ వుంచిన విషయం అందరూ చూసే వుంటారు. హైదరాబాద్‌లోని కొన్ని హోటళ్ళలో మసాలా దోసెలకు "గబ్బర్‌సింగ్ దోసె, బ్రూస్‌లీ దోసె, దారాసింగ్ దోసె" అని పేర్లు పెట్టారట.

'టి' షర్ట్‌లు తయారుచేసే కొందరు "దస్ నంబ్రి, హమ్ కిసీసె కమ్ నహి" చిత్రాల ఖ్యాతిని ఇప్పుడు వినియోగించుకుంటున్నారు. ఐతే, దాదాపు 35–40 ఏళ్ల క్రితమే "హంటర్ వాలి" స్టంట్ చిత్రం పేరును ఎందరో రెడీమేడ్ దుస్తుల కంపెనీవారు ఉపయోగించుకున్నారు.

### ఆదిలోనే ఆదిమానవులు

"ఆదిమానవులు" చిత్రం లాంటిది 1935 లోనే హిందీలో తయారైంది. దాని పేరు "హిమ్మత్ ఇమర్దా." నేడు వృద్ధనారి పాత్రలు ధరించే కేరెక్టర్ ఆర్టిస్ట్ లలితాపవార్ అందులో నాయిక. ఆమె అప్పుడు అర్ధనగ్న వింపిరి దుస్తులలో నటించింది.



**'మొరటోడు'లో సత్యనారాయణ, జయసుధ**

## జి. వి. జి. పేజీ

[32వ పేజీ తరువాయి]

**అపర్ణా మూవీస్**

ఛాయాగ్రాహకుడు పి ఎస్ ఆర్ స్వామి త్వరలో ప్రారంభించే వర్ణ చిత్రంలో సత్యనారాయణ, జయసుధ ముఖ్య భూమికలు నిర్వహిస్తారు మాటలు. సత్యానంద్ సంగీతం. సత్యం కధ, దర్శకత్వం · పర్వతనేని సాంబశివరావు

**విదేశ నటుని విస్మయం**

''షాలిమార్'' చిత్రంలో నటించడానికి ఇటీవలే మన దేశానికి వచ్చి వెళ్ళిన రెక్స్‌హారిసన్ ఏటా ఒక్క చిత్రంలోనే నటిస్తాడు. మన తారలు ఒకేసారి దాదాపు 20–25 చిత్రాల్లో నటిస్తూంటారని విని విభ్రాంతుడయ్యాడు.

**తయారైన మొత్తం చిత్రాలు**

1912 మే 18 న మన దేశంలో తొలి చలనచిత్ర ప్రదర్శన జరిగింది. 1977 మే 18 న వజ్రోత్సవం జరిగిననాటికి మన దేశంలో 27 భాషల్లో మొత్తం 11,385 చిత్రాలు తయారయ్యాయి [వీటిలో 1,279 మూకీ చిత్రాలు. ఆంగ్ల, అరబిక్, నేపాల్, సింహళ వగైరా అన్యభాషల్లో తయారైన చిత్రాలు5].★

# వారఫలం

మహేష్

23-12-1977 శుక్రవారం మొదలు
29-12-1977 గురువారం వరకు

**మేషం:—** మీ ఆలోచనలు ఫలిస్తాయి. ప్రయాణాలు బాగుంటాయి. వృత్తిలో పోటీవారి పోటీ తగ్గుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. స్త్రీలకు — విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**వృషభం:** — ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. రావలసిన డబ్బు అందుతుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**మిథునం:—** మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. చికాకులు యేర్పడతాయి. వారం మధ్యలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. నూతన వ్యవహారాలు లాభించగలవు. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**కర్కాటకం:—** వృత్తివ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. వారం మధ్యలో శ్రమ కలుగుతుంది. లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**సింహం:—** అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. బంధువులకు సహాయం చేస్తారు.

**కన్య:—** అనుకూలమైన వార్తలను వింటారు. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల:—** ఫలితంలేని శ్రమ కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం మధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వృత్తిలో ముఖ్యమైనవ్యక్తులను కల్సుకొంటారు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. విలాస వస్తువులు కొంటారు.

**వృశ్చికం:—** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి. మీ ఆలోచనల ఫలిస్తాయి. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వారం ఆఖరులో వృత్తివ్యాపారాలు బాగుంటాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. సాటివారిలో గౌరవం లభించగలదు.

**ధనుస్సు:—** అనవసరమైన సందేహాలు కలుగుతాయి. వృత్తిలో సాటివారి పోటీ పెరుగుతుంది. రావలసిన డబ్బు అందుతుంది. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వారం ఆఖరులో చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరం కోసం వ్యయం జరుగుతుంది.

**మకరం:—** నూతన వ్యవహారాలు బాగుంటాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. మీ కార్యక్రమాలకు మార్పుల వస్తాయి. సాటివారితో వాదప్రతివాదాలు తగవు. ఆర్థిక వ్యవహారాల బాగుంటాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధిస్తారు.

**కుంభం:—** మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. బంధుమిత్రులను కల్సుకొంటారు. వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. స్త్రీలకు — దైవకార్యాలు నెరవేరతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మీనం:—** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ఆర్థిక వ్యవహారాల్లో మొగమోటాలు తగవు. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

## భూతవైద్యుడు

(14వ పేజీ తరువాయి)

చేతులు పట్టుకొన్నాడు. ఆ మీదట శిష్య పరమాణువు చేతుల్లోని మూట నందుకొన్నాడు. అతడు ముందు మేము వెనుకగా —ఆతని యింటికి వెళ్లాము.

బాట ప్రక్కనే మూడంకణాల పూరిల్లు. అదే పైజా పూరిల్లు ఎదురుగా పశువుల కొట్టము. ఈ రెండింటినీ వేరుచేస్తున్నట్లు యింటిముందర చింతచెట్టు - పశువుల కొట్టంలో వో నడితరం మనిషి చెత్త తట్ట కెత్తుతూ వుంది. ఇంచు మించు ఆ వయస్సు మనిషి ఎద్దులకు కుడితి తాపుతున్నాడు. బహుశా పరదేసు తల్లిదండ్రులై వుండవచ్చు. పరదేసు గబగబా వెళ్లాడు. మూట నింట్లో పెట్టాడు. వో నులక మంచాన్ని తెచ్చి చింతచెట్టు కింద వేశాడు. కూర్చున్నాము. శిష్యపరమాణువు బారెడు దూరంలో సవినయంగా నిలబడ్డాడు. అంతలో వో అమ్మాయి దాహానికి మజ్జిగ తెచ్చింది. పళ్లెటూళ్లో...అందులో మూడంకణాల పూరింట్లో వుండవలసిన ఆకారంగా తోచలేదు. కోటేరేసి నట్లున్న ముక్కు ... చారడేసి కండ్లు...చక్కని పలువరస—చూడ ముచ్చటగా వుందా అమ్మాయి. పరదేసు భార్య కాబోలు. పరదేసును, ఆ అమ్మాయిని ప్రక్కన ప్రక్కన నిలిపితే ఈడూ జోడూ యేరికోరి కూర్చినట్లుంది. మరి యిదేమి మాయదారి రోగమో ?

"చూడు పరదేసూ! ఆ పొద్దు చెప్పిన వన్నీ తయారుచేసి పెట్టావా ?" పుల్లయ్య ప్రశ్న.

తయారు చేసి వుంచినట్లు తలాడించాడు పరదేసు.

"తీసుకురా !" భూతవైద్యుని ఆజ్ఞ.

వో సుమారు పాటి మూటను దెచ్చి ముందుంచాడు పరదేసు. మూట విప్పాడు.

"ఇదో యివ్వి నవధాన్యాలు. ఇవి తొమ్మిది నిమ్మకాయలు. ఇది కర్పూరం, ఇది గుగ్గిలం ఇదో ఈ పొట్లం సాంబ్రాణి. ఇవ్వి మూడు రకాల పొళ్లు. ఇది మూడు రకాల దారాలు, ఇది రాగిరేకు..." యిలా పేరు పేరున ఒక్కొక్క వస్తువు తీసి చూపించాడు పరదేసు. శిష్యపరమాణువు సరిచూసుకొంటున్నాడు.

"ఇవ్వుండనీ! ... బెత్తా లెక్కడ ?" భూతవైద్యుడి ప్రశ్న.

# హార్లిక్స్
## మీకు ఎక్కువగా అవసరమయినప్పుడు శక్తినిచ్చే కీలకపోషక పదార్థం.







### గర్భవతిగా ఉన్నకాలంలో

గర్భిణీ స్త్రీకి మంచి సమతూకంలో ఉండి, తేలిగ్గా జీర్ణమయ్యే ఆహారం అవసరం. అందువల్లనే గర్భిణీగా ఉన్నప్పుడు హార్లిక్స్ ఆదర్శప్రాయమయిన ఆహారం. ఇది తల్లికి, పిల్లకి కూడా శరీర నిర్మాణానికి కావలసిన మాంస కృత్తులు, కార్బోహైడ్రేట్లు సరిఅయిన సమతూకంలో సమకూరుస్తుంది. రాత్రిళ్ళు సేవించిన మలబద్ధకం ఉండదు. ఉదయమే నిస్సత్తువగా ఉండటం పోతుంది.




### అస్వస్థత / అస్వస్థనుంచి కోలుకునే కాలంలో

జబ్బు చేసినప్పుడు మీ శరీరం ఎంతో విలువయిన మాంసకృత్తులు, పోషక పదార్థాలు కోల్పోతుంది. దీనివల్ల నిస్సత్తువ ఏర్పడుతుంది. ఈ నష్టాలను భర్తీ చేసేందుకు హార్లిక్స్ తేలిగ్గా జీర్ణమయ్యే రూపంలో శరీర కణాల నిర్మాణానికి కావలసిన మాంసకృత్తులు, శక్తినిచ్చే కార్బోహైడ్రేట్లు ఖనిజాలు సమకూరుస్తుంది. దీనివల్ల మీరు త్వరగా కోలుకొంటారు. మళ్ళీ జబ్బు పడకుండా తట్టుకునే శక్తి ఏర్పడుతుంది.

## ప్రపంచమంతటా డాక్టర్లు సిఫార్సు చేశారు
## హార్లిక్స్ మంచి పుష్టికరమైనది

హార్లిక్స్ రిజిస్టర్డ్ (ట్రేడ్ మార్క్)

# భూతవైద్యుడు

"ఇదో యివ్వి సింత బరికెలు. ఇవ్వీఁ బరికెలు..." అంటూ రెండు కట్టలు తెచ్చి ముందుంచాడు పరదేసు. ఒక చింత బరికె అందుకొన్నాడు భూత వైద్యుడు. గాలిలో 'ఛళ్' మనిపించాడు ఆ బెత్తాన్ని.

"హ్హాహ్హాహ్హా ... బాగున్నాయ్. ఈ దెయ్యాలుండాయి చూడు బాబూ! కొన్ని మంత్రాలకు లొంగుతాయి, కొన్ని దెబ్బలకు సొంగ కారుస్తాయి. ఇంకొన్ని వుంటాయి అవి భలే మొండివి. వాటితో యాగడంవే శానాకష్టం!" – వైద్యుడు బిగ్గరగా చెబుతున్నాడు. నేను శ్రద్ధగా వింటున్నాను. నా కంటే శ్రద్ధగా మరోవ్యక్తి తలుపు సందు నుంచి తొంగి చూస్తూ వింటున్నట్లు నా కంటే ముందుగా భూత వైద్యుడే గమనించి నట్లుంది. అందుకేనేమో మరీ ధీమాగా చెప్పుక పోతున్నాడు.

"ఈ మధ్య తూర్పున పొరకపల్లె పక్కన పోడుజేనులో ఒక కేసు తగిలింది. ఒక ఆదివారం మంత్రం వేసి వచ్చినాను. ఏవీ లాభం లేకపోయింది. ఆ మరసటి ఆదివారం సందెడు చింతబరికెలు, ఈత బరికెలు తుక్కుతుక్కయి పొయ్యినాయి. ఉహూఁ! కూలు కుదరలా! మూడో వారం యిదంతా లాభంలేదని ఏకంగా రక్ష తగిలించినా!"

"అంటే!"—ఆతురతగా అడిగాను.

"రక్ష అంటేనా?" – హ్హాహ్హాహ్హా ... అని తన సహజ ధోరణిలో నవ్వి. జోలె నుండి మూడు రాగి రేకులను తీసి చూపించాడు. ఒక్కొక్క రాగిరేకు ఒకటిన్నర అంగుళం చతురస్రాకారములో వుంది. ఒక రేకు మీద 'వోం' అని, మరో రేకుమీద 'హీం' అని మూడవదాని మీద ఆంజనేయుని బొమ్మ వున్నాయి.

"వీటినేం చేయాలి?" — సందేహంగా అడిగాను.

"ఏంచేయాలా? ... సింత నిప్పల్లో ఎర్రంగా కాల్చి రొండు బుజాల మింద రొండు నొసటొకటి ముద్దర్లు యేశావంటే నా సావిరంగ యింక జన్మంలో సోకిందా దెయ్యం సోకమంటే!"—

"పొరకపల్లెలో నిజంగా ఈ పని చేశావా?"

"వెళ్లి చూడరాదూ నీకే తెలుస్తుంది!"

అంతలో పరదేసు వచ్చి భోజనానికి లెమ్మన్నాడు. అక్కడికి దెయ్యాల కథ ఆగింది. పాపం! పరదేసు వున్నంతలో తగు జాగ్రత్త తీసుకొన్నాడు. నేను తింటున్నంత సేపూ నా ప్రక్కనే నిలబడ్డాడు. 'ఏదో పేదోళ్ల బతుకులన్నా! ఎట్లుందోయేంవో!' అని మాటి మాటికి సంజాయిషీ చెప్పకుంటున్నాడు. వాళ్లు పెట్టిన దానికంటే చూపిన ఆప్యాయత ఎక్కువగా వుంది. అందుకేనేమో చాలా తృప్తిగా తినినట్లనిపించింది. భోజనాలయ్యాయి. వైద్యుడు చింతచెట్టు కింద నులక మంచం మీద నడుం వాల్చాడు. నేను పరదేసు తల్లిదండ్రులతో పిచ్చాపాటీ మాట్లాడుతూ కూర్చున్నాను.

సరిగ్గా మూడు గంటలకు లేచాడు వైద్యుడు. రాహుకాలం రాబోతూందని తొందర చేశాడు. మూడు బావుల్లో మూడు బిందెల నీళ్లు తెప్పించాడు. ఆ నీళ్లు కలబోసి స్నానం చేశాడు. మళ్లీ వేషధారణ యథా విధంగా చేసుకొన్నాడు. ఈ పర్యాయం ఎవ్వరెవ్వరో తన మంత్రశక్తికి ముగ్ధులైన వాళ్లు యిచ్చిన పతకాలను జాగ్రత్తగా తగిలించుకొన్నాడు. సామానులన్నిటినీ తీసుకొని బయలుదేరమని పరదేసుకు పురమాయించాడు. శిష్యుడు, పరదేసు చెరి కొంతగా సామానులు నెత్తికెత్తుకున్నారు. నలుగురము బయలుదేరాము. ఊరికి ఉత్తరంగా వో పెద్ద మామిడి తోపు. ఆ తోపులో ప్రవేశించాము. ఆ తోపంతా కలియతిరిగి నల్దిక్కుల చదరంగా వున్న వో స్థలాన్ని నిర్దేశించాడు పుల్లయ్య. ఆ స్థలాన్ని పారతో చెక్కి శుభ్రం చేయమన్నాడు. పరదేసు పార చేతబట్టి చెక్కుతూవుంటే మేము మామిడి చెట్టు నీడలో విశ్రమించాము. శిష్యపరమాణువు సామాన్లు విప్పి సరిచూసుకొనడములో నిమగ్నుడైనాడు. వైద్యునిలో గంభీరత రాను రాను హెచ్చిపోతూ వుంది. అందువల్ల నేను కేవలం ప్రేక్షకుడిగా నిలబడి పోయాను.

పరదేసు ఆ స్థలాన్ని కసవు గట్రా చెక్కి శుభ్రం చేశాడు. పుల్లయ్య పైకి లేచాడు. ఇటు తొమ్మిదటు తొమ్మిదడుగులు కొలిచాడు. ఒక్కొక్క మూల ఒక్కొక్క ముష్టి మేకును దించమన్నాడు. నాలుగు మూలల్లో నాలుగు ముష్టి మేకులు ఆ ముష్టి మేకుల్ని చుట్టి మూడు రంగుల దారాలు తొమ్మిదడుగుల చతురస్రం తయారయింది. మళ్లీ మూడు బావుల నీళ్లు తెప్పించాడు. ఆ చతురస్రములో కళ్లాపు చల్లాడు. ఆవుపాలను ప్రోక్షించాడు. పంచితాన్ని ప్రోక్షించాడు. పసుపు నీళ్లు చల్లాడు. ఆ తరుపాత ఆ చతురస్రములో తాను ప్రవేశించాడు. మూడు మూకుళ్లలో మూడు రంగుల పొళ్లు ముందుంచాడు శిష్యపరమాణువు. ఏపుగా పెరిగిన మామిడి చెట్లతో అక్కడక్కడ పూల మొక్కలతో అందంగా వుండే ఆ తోట చూచి వద్దామని అలా బయలుదేరాను.

పొద్దు గూట్లో పడింది. గోరువంకలు, చిలుకలు, మామిడిచెట్ల మీద చేరి గోల చేస్తున్నాయి. సంజ చీకటి నల్దెసల ఆవరించింది. నేను తోటంతా తిరిగి, ఆ మీదట ఆ పరిసర ప్రాంతాల్లో పొలంగట్ల మీద నడిచి వాతావరణములోని ప్రశాంతతను గుండెల్లో నింపుకొని మళ్లీ వైద్యుని కడకు వచ్చాను.

వైద్యుడు చతురస్రం బయట నిలబడి తీవిగా చూస్తున్నాడు. ఎడమచేత కుడి మీసాన్ని మెలివేస్తున్నాడు. ఏదో సాధించిన తృప్తి ఆతని కన్నుల్లో ప్రతిఫలిస్తూవుంది. శిష్యపరమాణువు నోటి కడ్డంగా గుడ్డ కట్టుకొని నిమ్మకాయల్ని నాలుగు దబ్బలుగా కోసి కుంకుమ తురిమి దిక్కు కొకటిగా పెడుతున్నాడు. అల్లంత దవ్వులో తడి బట్టలతో తల వాల్చి కూర్చొని వుంది దెయ్యం. అదే పరదేసు పెళ్లాం. మూడు నల్ల కోళ్లను అప్పుడే యింటి నుండి తెచ్చినట్లుంది పరదేసు. పారిపోకుండా కాళ్లు గుదికట్టుతున్నాడు. వైద్యుని ప్రక్కన నిలబడి చతురస్రం వైపు చూశాను. నా కన్నులను నేనే నమ్మలేక పోయాను. వైద్యుని ప్రతిభ మీద ఈర్ష్య పుడుతూ వుంది. సంజీవి పర్వతాన్ని అరచేతబట్టి ఆగమేఘాల మీద వస్తున్న ఆంజనేయ స్వామిని అద్భుతంగా తీర్చిదిద్దాడు. మూడు పొళ్లు అంటే బొగ్గుపొడి, ముగ్గుపిండి, యిటుకరాతి పొడిని మాత్రమే వాడుకొన్నాడు. నిజంగా ఎంత బాగుందో! ఈ కళ ఆతని కెలా అబ్బిందో? అని నేనాశ్చర్యపడుతూంటే—ఆతడు పసుపు కుంకుమ చేతికందు కొన్నాడు. పై మెరుగులు దిద్దుతున్నాడు.

జాముర్రాత్రి కావచ్చింది. పల్లెప్రాంతాలు కదా? అప్పటికే ప్రశాంత వాతావరణం నెలకొనింది. అమావాస్య దగ్గరిరోజులేమో? కన్ను పొడుచుకున్నా కనుపించని చిమ్మ చీకటి దట్టంగా వ్యాపించింది. ఆ చీకట్లో నిజంగానే మామిడిచెట్లు దెయ్యాల్లాగా కనుపిస్తున్నాయి. వాటిమీద గోరువంకలు, చిలుకల అలికిడేమాత్రం లేదు.

మళ్లీ మూడు బావుల నీళ్లు మూడు బిందెలు ఆమె నెత్తిన పోయించాడు. ఆంజనేయస్వామి ముందు కూర్చోబెట్టాడు. అష్టదిక్పాలకులకు హారతి పట్టినట్లుగా ఎనిమిది దిక్కుల్లో దిక్కుకు గచ్చకాయంత కర్పూరం ముట్టించాడు. ఆ కర్పూరం ఆరకుండా



చూసుకోవున్నాడు. ఆ ప్రశాంత వాతావరణములో, ఆ చిమ్మ చీకట్లో, కర్పూరం వెలుగు, ఆ వెలుగులో ఎంగు రంగుల ఆంజనేయస్వామి, తల పైకెత్తి చూస్తే కుండతో కుమ్మరిస్తున్నట్లు చిమ్మచీకటి— గుండెలు జలదరిస్తున్నాయి. పుల్లయ్య వేపమండ చేతికందు కొన్నాడు. "శ్రీ ఆంజనేయం! ప్రసన్నాంజనేయం!!" అని బిగ్గరగా ప్రారంభించి ఆపై నిలికి లేకుండా గొణుగుకున్నాడు. పరదేసు చేతులు కట్టుకొని భయభక్తిగ నిలబడి వున్నాడు. ఏ సమయములో గురువర్యునికి ఏ మవసర మవుతుందో అందివ్వడానికి శిష్య పరమాణువు సిద్ధంగా వున్నాడు. "ఒరే!...బిడ్డా...! నీ యాటలు నా దగ్గిర సాగవురో ... మూటా ముల్లె సర్దుకోరా! వచ్చినదారి పట్టిపోరా! ... ఏమం టే నీ వాత మట్టేరో!..." పరదేసు భార్య ఊగడాని కారంభించింది. ఊరికే వూగడంలేదు. ఊగుతూ రాగం అందుకొంది.

పుల్లయ్య సన్నగా నవ్వుకొంటున్నాడు.

"నీ యబ్బ లాంటోళ్ళను చూశానురో ! నా జోలి కొచ్చేదానికి నీ తాతలాంటోళ్ళ తరంగాలేదురో! నీ యాటలింక మూటకట్టరో!" రాగం కొనసాగుతూనే వుంది. మంత్రమూ కొనసాగుతూనే వుంది.

"మంత్రాలకు చింతకాయలు రాలవురో నడవా !"...

"ఏయ్! రాలవా! అయితే చూడు నా తడాఖా !" — తోక తొక్కిన త్రాచులా పైకి లేచాడు పుల్లయ్య. కన్నులు నిప్పులు క్రక్కుతున్నాయి. తోపు దద్దరిల్లేలా నవ్వాడు. నవ్వుతూ చెంబులోని మూడు బావుల నీళ్ళు దోసెడు తీసుకొన్నాడు. 'హ్రాం' అని బిగ్గరగా అరుస్తూ నేలమీద చల్లాడు.

ఆశ్చర్యం !

అరఫర్లాంగు దూరంలో ఉన్నట్లుంది వెలిగించిన మంట మండి ఆరిపోయింది! 'శ్రీం' అని అరుస్తూ నేలమీద మళ్ళీ దోసెడు నీళ్ళు కొట్టినట్లు చల్లాడు. గప్పున మంట మండి ఆరిపోయింది. 'హ్రీం' అని అరుస్తూ మళ్ళీ నీళ్ళు చల్లాడు. మళ్ళీ గప్పున మంట మండి ఆరిపోయింది

ఆ వాతావరణంలో నాకె ఒళ్ళు ఝల్లుమనింది !

"ఏయ్! చూశావా నా మంత్రశక్తి!...

# భూతవైద్యుడు

శాకిని ఢాకిని భూత భేతాళాది మహోదుష్ట గ్రహాల పాలిటికి ఉన్నాడు! ఉన్నాడు!! నా స్వామి ఆంజనేయస్వామి !—వీరాంజనేయ స్వామి!... రేపీ పాటికి ఈ మనిషిని వదలక పోతివో నీ వాత మట్టే గొట్టిస్తా! చింత బరికెలతో, ఈత బరికెలతో నీ యీపు సితగ్గొట్టిస్తా ! ఖబర్దార్!" గుండెలవిసేటట్టు ఆవేశంలో అరిచాడు పుల్లయ్య.

దెయ్యం కూడా హడలి నట్లయింది. సొమ్మసిల్లి పడిపోయింది.

ఏదో ముంచుక పోయినట్లు శిష్యపరమాణువు గురువుగారి చేతికి నిమ్మకాయ లందిస్తూంటే - ఒక్కొక్క కా య నే

## ప్ర తి క్రి య

ప్రాణం పోసే నీరూ, గాలీ
ప్రాణం తీస్తే యేం చేయాలి ?
ప్రకృతికి మనిషి లోకువయేనా ?
ప్రకృతిని గెలిచే రోజొచ్చేనా ?
ప్రజ త్వరలో విజ్ఞానఫలాలను
వెలిగింపగలరు
ప్రస్తుత ప్రళయ వృత్యానికి ప్రతిక్రియను
చేయగలరు.

— దా శ ర థి.

పిండుతూ దిష్టి తీశాడు. కర్పూరంతో దిష్టి తీశాడు. తొమ్మిది టెంకాయలు కొట్టి దిష్టి తీశాడు. గంపెడు బొరుగులు, సెనగలు పరదేసు చేతుల మీదుగ ఆ తోటంతా చల్లించాడు. ఆహూతులైన పిశాచ బృందానికి ఈ బొరుగులు ఆహారమట! — ఇంతపని జరుగుతున్నా పుల్లయ్య నోరు ఆగకుండా పడుతూనే వుంది. కడసారిగ నో కోడిని చేతి కందించాడు శిష్యపరమాణువు.

ఆ కోడిని చేతికందు కున్నాడు పుల్లయ్య. రౌద్రాకారం దాల్చాడు. కోడి కాళ్ళు రెంటిని చేర్చి పట్టుకొన్నాడు. మూడుసార్లు బొమ్మకు, అటుపై మూడుసార్లు దెయ్యం సోకిన అమ్మకు దిగదీశాడు. కసుక్కుమని గొంతు కొరికాడు. రక్తం చిమ్మన గ్రోవితో చిమ్మినట్లు కారుతూ వుంది. ఆ రక్తంతో నాలుగు దిక్కుల్నీ అభిషేకించాడు. [illegible] కోడితో మళ్ళీ దిష్టి తీశాడు మూడుసార్లు దిగదీసి! ఆ తరువాత విసిరి అవతల పారేశాడు.

మళ్ళీ ఒక కోడిని చేతికందించాడు శిష్య పరమాణువు. దాని గొంతూ కొరికాడు. రక్తాన్ని నాలుగు దిక్కులా చల్లాడు. దాంతో దిష్టి తీశాడు మూడుసార్లు దిగదీసి, అటుపై అవతల పారేశాడు. మూడవకోడిని అందించాడు శిష్యుడు. దాని గతీ అంతే అయింది. అప్పటికి శాంతించినట్లు ఓనబడ్డాడు పుల్లయ్య.

"పరదేసూ !" — గంభీరంగా పిలిచాడు పుల్లయ్య.

అల్లంత దవ్వులో వున్న పరదేసు అడుగులో వచ్చి నిలబడ్డాడు 'ఆజ్ఞ' అన్నట్లుగ.

"సామగ్రి సర్దుకో ! తిరిగి చూడకుండా తీసుకపో ! రేపీ నాటికి దిగకుంటే వచ్చి చెప్పు !"—ఆజ్ఞాపించాడు పుల్లయ్య.

ఆదరాబాదరా సామానులు సర్దుకొన్నాడు పరదేసు తడిసి ముద్దయిన ముద్దరాలిని లేపి నిలబెట్టాడు. ఆమె అతని బుజంమీద వాలిపోయింది. మెల్లగా నడిపించుకుంటూ ఇంటివైపు బయలుదేరాడు. చూడముచ్చటగా వుంది వాళ్ళిద్దరినీ !—

పరదేసు ఆ తోట దాటి దాటే వరకు గమనిస్తున్నాడు శిష్యపరమాణువు. తోట దాటి బయట పడ్డాడో లేదో - మూడు కోళ్ళను చేర్చి గుదికట్టాడు. టెంకాయ చిప్పలు, తాంబూలాలు, అందులో దక్షిణలు గబగబా సర్ది మూట గట్టాడు. వస్తూ తెచ్చిన వైద్యపు మూట, యిక్కడ చేరిన మూట, మూడు కోళ్ళు— మోయలేని బరువయింది శిష్యునికి. అయినా తప్పదు. నాకు నోట మాట రాలేదు. ముగ్గురూ బయలుదేరాము. అంత రాత్రిపూట కొంపచేరడానికి నడక తప్పితే గతిలేదు. బాటమీదపడి నడుస్తున్నాం. ఎవరూ మాట్లాడటం లేదు. ఫర్లాంగు దూరం వెళ్ళేసరికి బాట ప్రక్కనే చెట్లు మాటున అలికిడయింది. చూద్దుము గదా? చెట్లమాటును నుండి మడివేలు పునిగాడు వస్తున్నాడు. వాని ఒకచేత గివిటీ వుంది. మరొకచేత కిరసనాయిలు ముంత ఉంది.

"ఈదరకాడ యిక్కడేం చేస్తున్నావు మునెయ్యా?" ఆశ్చర్యంగా అడిగాను.

ఆ మాటతో పుల్లయ్య నవ్వుతున్నాడు. మడివేలు మునిగాడు విరగబడినవ్వుతున్నాడు వీళ్ళిద్దరూ నవ్వడంతో శిష్యపరమాణువు చిన్నగా నవ్వుతున్నాడు నేనే అందరిలో తేల మొగమేసింది!

"అదిగాద్సామీ అంత మాత్రం తెల్సుకోక పోతే యెట్లా?... నేను బూతంవు. వాడో యిద్దుడూ!

"ఎట్లా?"

"ఎట్లంటే అదట్లనే! నాది ఆట... వాడిదిమాట!"

వీడి ఆట వాడి మాటను గురించి ఆలోచిస్తున్నాను.

"మీరన్నా నాయం జెప్పండి సామీ! బూతానికి పనిజాస్తి లేకుంటే వయిద్దుడికి పనిజాస్తి! మాటతో కూడా మంట మండించి ఆర్పేదంటే మాట్లా!"

'హోరి వీళ్లదుంపతెగా!' అనుకొనేసరికి నోట మాట రాలేదు.

"సామీ!సామీ! ఎప్పుడూ రొండు కోళ్లిడే కొట్టేస్తా వుండాడు. ఈసారి మీరన్నా సిపార్సు చేసి రొండు నాకీమనండి. బొంతో నొడ్డువాగులో యిప్పసారాయి అప్పటంగా దించుండా! కోడి కూరకు సారాయికి నా సావిరంగా! బలే రంజుగా వుంటాది!"

ఆ మాటతో పుల్లయ్య కూడా నవ్వుతున్నాడు. శిష్యపరమాణువు చిన్నగా నవ్వుతున్నాడు. ఈసారి అందరికంటే బిగ్గరగా నవ్వింది నేను!

* * *

ఆ మరునాటి రోజు బస్సుమీద బయలుదేరాను. ముప్పై యేండ్ల తరువాత పుట్టిన వూళ్లో మూన్నాళ్ళు గడిపిన తృప్తితో బయలుదేరాను. గొబ్బిళ్లమిట్టలో బస్సు ఆగింది. ఎవరో దిగుతున్నట్లుంది. నాకు తెలియకనే నా చూపు పరదేసుయింటి వైపు మళ్లింది. చింతచెట్టు కింద నులక మంచంమీద చిలుకా గోరువంకల్లాగ పరదేసు ఆతని పెళ్లాం కంటబడ్డారు. ఆ చెట్టు మీదనే రెండు పిచ్చుకలు ముక్కు ముక్కు మోటించి మురిసిపోతున్నాయి! 'హోరా! పుల్లయ్యా!' అనుకొనేసరికి బస్సు కుదుపుల్లో ఎగిరిపడిన మనసు, కుదుట బడింది బస్సు సాఫీగా సాగిపోతూంటే.

# జీవన పోరాటంలో — ఆశల ఆరాటం

సీరియల్ పి.వి.ఆర్. శివకుమార్

*(గత సంచిక తరువాయి)*

ఒక్కసారి పక్కకు తిరిగి నిశితంగా ఆమె వైపు చూసి, దృష్టిని మళ్ళీ రోడ్డు మీదికి మళ్ళించి అడిగాడు భాను నెమ్మదిగా, "ఎవరినయినా యిది ఏ రకే నిర్ణయించుకున్నావా రాధా?"

"అ...వు...ను..."

"ఎవరతను? చెప్పు రాధా! ఈ విషయం అత్తయ్యతోనూ, మామయ్యతోనూ చెప్పి అతనితో నీకు వివాహం జరిగేలా ప్రయత్నిస్తాను." ఆమె తనని కోరబోయే సహాయం అదేనని గ్రహించినవాడిలా అన్నాడు భాను.

"భానూ..." రోషమూ, నిరాశ పెనవేసుకున్నాయి రాధ కంఠంలో. కావాలనే తవనతడు అవమానిస్తున్నాడనీ అనిపించిందామెకి కాని అతడి ముఖంచూస్తే, నిర్మలంగా, అమాయకంగా కనిపించింది

"నువ్వేటువంటిసహాయాలేం చెయ్యనక్కర్లేదు. ముందు అతణ్ణి ఒప్పిస్తే చాలు" అంది తిరిగి.

"అంటే అతడికే యిష్టంలేదా?"

"ఒకప్పుడు అతనే అడిగాడు నన్ను. అప్పుడు నాకు యిష్టంలేక, వద్దనేశాను. ...ఇప్పుడు తన వంతు వచ్చిందిగా! బదులు తీర్చుకుంటున్నాడు అందుకే..." ఆపేసింది రాధ.

భానుకి ఆమె అనేదేమిటో అర్థమయింది. ఉలిక్కిపడ్డాడు.

"ఏమిటి రాధా నువ్వనేది?" అయోమయంగా ఆమెకేసి చూశాడు. అప్పుడే అతనికేసి చూసిన రాధ, నాలుగు కళ్ళూ కలవటంతో చూపులు తిప్పుకుని అంది.

"అవును భానూ! మనం పెళ్ళి చేసుకోవాలని నా కోరిక!"

"రాధా! తెలిసే మాట్లాడుతున్నావా?! ఎవరికోసం రాధా యీ కోరిక?"

"నేనంటే నీకు యిష్టం లేదనీ, అసహ్యం అనీ కూడా నాకు తెలుసు. ఇప్పుడు నువ్విలా మాట్లాడటం..."

ఆఁ... అర్థమయింది నిన్ను అత్తయ్య పంపింది కదూ నన్నిలా అడగమని?" — అడిగాడు...

అతడికి హఠాత్తుగా ఆరాత్రి అత్తయ్య మామయ్య నడగడం, ఆయన కాదనటం— ఆవిడ బాధ పడటం గుర్తుకి వచ్చాయి.

'ఇటునుంచి ప్రయత్నిద్దామనుకుంటోందా అత్తయ్య! రాధని మెడలు వంచి ఒప్పించి, నా ద్వారా అడిగించాలనుకుంటోందా?'

అతడి మాటలు విని ఆశ్చర్యపోయింది రాధ.

"అమ్మ పంపిందా నన్ను? అమ్మ కసలీ విషయమే తెలియదు. అయినా, నా మీద నీకు నమ్మకం లేదా భానూ?"

"కాదు రాధా! నా కెందుకో అలా అనిపించింది. పోనీ, నువ్వేచెప్పు. అప్పుడు కాదన్న నన్ను, యిప్పుడెందుకు కావాలనుకుంటున్నావో?"

"ఆలోచించు భానూ. నీకే అర్థమవుతుంది."

"అప్పుడెందుకు కాదన్నావో యిప్పుడు తెలుస్తోంది. కాని యిప్పుడెందుకు కోరుకుంటున్నావో మాత్రం... ఊహూఁ... అర్థం కావటంలేదు!"

"ఎందుకంటే... అప్పటికీ, యిప్పటికీ నీకు పోలికేలేదు గనక! ఎందుకయితే నేం, యిప్పుడు నాకు యిష్టమేనన్నానుగా! నా కోరిక కాదనకు భానూ! మీ యింటికి వచ్చేసే అదృష్టాన్ని, అత్తయ్య దగ్గరే వుండిపోయే భాగ్యాన్ని, ఆమె అనురాగాన్ని పొందే అవకాశాన్ని నా కివ్వు."

ఆమె ఆవేశం అతనికి వింతగా తోచింది. రాధలో యిలాటి కోరికలున్నాయని అతడెప్పుడూ వూహించలేదు.

"నువ్వు కలవారి బిడ్డవు రాధా! నువ్వే యింట మెట్టినా మా అమ్మని మరిపించగల అత్తగారు దొరుకుతుంది నీకు. మాయింటికి ఏమాత్రమూ పోలికలేని భవంతి లభిస్తుంది.

మా వూళ్ళో... మా యింట్లో... ఏముంది నీకు? ఇబ్బందులు, చిరాకులు, కష్టాలు, బాధలు యివేగా!

చిన్నప్పటినుంచీ గారాబంగా పెరిగిన నీకు ఆ జీవితం భరించలేనంత చిరాకు పుట్టిస్తుంది."

"అందుకే ఆ కష్టాలూ, యిబ్బందులూ బాధల్లో నీకు తోడుగా నిలవాలనే నా కోరిక భానూ!

ఏ బాధ్యతలూ పట్టకుండా నిర్లక్ష్యంగా తిరుగుతున్న నిన్ను వంటరిగా వున్న నాతో మాట్లాడవచ్చిన రోజు, కర్తవ్యం విప్పిచెప్పి ఓ లక్ష్యంకోసం పాటుపడే మార్గానికి మళ్ళించింది నేను!

ఇవాళ ఆ లక్ష్యంకోసం పరిశ్రమిస్తున్న

**జరిగినకథ 8·** అల్లరి చిల్లరిగా తిరుగుతూ చెడు సహవాసాలకి లోనైన కొడుకు భానుని పాలిటెక్నిక్‌లో చేర్పించమంటూ చెల్లెలు కౌసల్య, బావ శంకర్రావుల దగ్గరికి పంపిస్తాడు సాంబయ్య. క్రమశిక్షణకి ప్రాణమిచ్చే శంకర్రావుగారి సంతానం రాజా, రాధలు. హాస్టల్లో చేరిన భాను చదువుకోకుండా సిగరెట్లు తాగుతూ, పేకాడటం చూసిన శంకర్రావుగార మందలిస్తారు. రాధకి శంకర్రావుగార పెళ్ళి సంబంధాలు చూస్తున్నారని విని బాధపడతాడు భాను. సాంబయ్యగారికి పక్షవాతం రావటంతో అసలే అంతంత మాత్రంగా ఉన్న ఆర్థిక పరిస్థితి మరింత క్షీణిస్తుంది. మనిద్దరం ఒకటి కావాలన్న భానుతో ముందు నీ బాధ్యతల గురించి ఆలోచించు అని నిర్మొహమాటంగా చెబుతుంది రాధ. రాధ మాటలు, స్నేహితుడు సూరిబాబు కాలేజీనుంచి వెళ్ళగొట్టబడటంతో భానులో మార్పు వస్తుంది. బాధ్యతలని గుర్తించిన భాను నడవడిక సాంబయ్యగారికి మానసిక శాంతినిస్తుంది. భానుతో రాధ పెళ్ళి జరిపించాలన్న ఆలోచన మర్చిపొమ్మని భార్యని హెచ్చరిస్తారు శంకరరావుగారు.

నీకు చేయూత నివ్వాలని ఆశించటం తప్పంటావా?''

ఆ విధంగా మాట్లాడుతున్న రాధని కాదని చెప్పాలనిపించలేదు భానుకి. కానీ శంకర్రావుగారు? ఆ రాత్రి ఆయన అత్తయ్యతో అన్న మాటలు ?

ఏది ఏమయినా తను అంగీకరించలేడు. అంగీకరించి ఆయన మనసుకి కష్టం కలిగించబోడు. అందరి దృష్టిలో ఆవిధంగా కృతఘ్నుడు కావటం తను కోరుకోడు.

ఆయనన్న మాటలతో తను పూర్తిగా ఏకీభవిస్తాడు !

కయ్యం, వియ్యం – సమ ఉజ్జీలకే శ్రేయోదాయకమనే నమ్ముతాడు తనూను !

రాధని తను చేసుకోవటంలో ఇద్దరికీ సుఖాలకన్న కష్టాలకే అవకాశం ఎక్కువ!

అటు శంకర్రావుగారికి, యిటు తనకి మధ్య అడకత్తెరలో పోకలా ఆమె నలిగి పోవాలి !

ముందు శంకర్రావుగారి మాటలు తనని చిత్రవధ చేస్తాయి !

'ఆస్తికోసం దానికి ఎరవేశావురా కృతఘ్నుడా !

ఏదో చెడి పోతున్నావు, చదువుకు బాగుపడతావని తీసుకువస్తే నా యింటికే ఎసరు పెడతావురా !' అనరూ ?!

'ఏ అర్హత వుందని దాన్ని కోరుకుంటున్నావు ?'

నేనిక్కడ దాన్ని చూసుకుంటున్నంత అపురూపంగా నువ్వు చూసుకోగలవా ?

ఇక్కడదానికి లభిస్తున్న సౌఖ్యాలలో పదో వంతయినా అక్కడ లభింపజేయకలవా?

దాన్ని ఆ పల్లెటూరికి తీసుకువెళ్ళి, ఓ పేదపురుగునిచేసి బురదలో దించుతావా ?

లేక ఏ మహానగరంలోనో నాలుగొందలు తెచ్చుకుంటూ దాన్ని, ఇరుకు గదుల్లో మగ్గబెడతావా ?

'ఏం చేద్దామని దాన్ని చేసుకుంటావ్?' అనడిగితే ఏం చెప్పగలడు ?

ఇప్పటికే తనకు తలకిమించిన బరువులున్నాయి. కనీసం మరో అయిదారేళ్ళ దాకా పెళ్ళిమాట ఆలోచించటమే యిష్టంలేదు.

తను ముందీ చదువు గట్టెక్కించాలి ఆ వెంటనే ఉద్యోగం వెతుక్కోగలగాలి. తండ్రి ఆరోగ్యం బాగుచేయించుకోవాలి తమ్ముడిని తిరిగి చదువులో పెట్టాలి.

పెద్ద చెల్లాయి పెళ్ళికెదుగుతోంది. ఒకటి, రెండేళ్ళలో ఆమెకి పెళ్ళి చెయ్యాలి!

ఇన్ని బాధ్యతలు వుంచుకుని తను పెళ్ళి చేసుకోవటం మూర్ఖత్వమే కాదూ ?

అందునా యిన్ని అబ్లిగేషన్లతో రాధని చేసుకోవటమా...!

"మాట్లాడవేం భానూ ?"

ఆలోచిస్తున్న భాను వర్తమానంలోకి వచ్చాడు.

"క్షమించు రాధా" అని మాత్రం అన్నాడు.

రాధ ఏం అనలేదు. అస్నోకపోయింది.

"అర్థం చేసుకో రాధా !

"నాతో నువ్వు ఆరోజా విధంగా మాట్లా

# జీవనపోరాటంలో...

డకపోయినట్లయితే నేనెటుపోతూ వుండే వాణ్ణో నాకే తెలియదు.

కానీ కళ్ళు తెరిచాకమాత్రం మళ్ళీ మూసుకునేటంత మూర్ఖత్వం నాలోలేదు.

నాకిప్పుడు ఎన్నో బాధ్యతలున్నాయి. అవన్నీ నెరవేర్చేదాకా నాగురించి ఆలోచించుకోదల్చుకోలేదు.

అందుకే మరో అయిదారేళ్ళదాకా నాకు పెళ్ళి ప్రసక్తే లేదు. అప్పటిదాకా నువ్వు ఆగటమూ నా కిష్టంకాదు.

మామయ్యని కాదని యిప్పుడు మనం పెళ్ళాడటం, కోరి కష్టాలని వరించటమే అవుతుంది.

ఆర్థికబలం లేనివాడి ఆశలకీ బలం వుండదు రాధా!

దయచేసి నన్ను మరింత దుర్బలుణ్ణి చెయ్యకు. మర్చిపో!

మామయ్య చూసిన సంబంధం చేసుకుని, జీవితంతో రాజీపడు. నీ పరిస్థితులలో అదంత కష్టం కాదు.

ఒక బావగా నామీద నీకు అభిమానమూ, సానుభూతీ వుంటే అంతేచాలు!

నన్ను మామయ్య దృష్టిలో కృతఘ్నుడిగా చేయకు!"

అతడంత స్థిరంగా అన్నాక, యింకే మనటానికీ రాధకి పాలుపోలేదు.

షుగర్ ఫ్యాక్టరీ దాపుల్లో కొచ్చారు యిద్దరూ.

"ఇకనేను వెళ్తాను రాధా! నువ్వు వెళ్ళగలవుగా!" అన్నాడు భాను, ఆగి.

"ఇంటికి రావూ?" దీనంగా అంది రాధ.

"ఇప్పుడెందుకులే రాధా, ఎల్లుండి వస్తానుగా!" అనేసి, రిక్షాకోసం చూసుకున్నాడు భాను. అతడెక్కిన రిక్షా దూరం వెళ్ళేదాకా చూసి, భారంగా ముందుకు కదిలింది రాధ.

* * *

రోజులు వేగంగా గడిచిపోతున్నాయి. భానుకి పరీక్షలు దగ్గరపడ్డాయి. ముందుగా యిచ్చిన శలవులు యిరవైరోజులూ అతను తన మకాం పూర్తిగా అత్తయ్య గారింటికే మార్చేశాడు. రాత్రింబవళ్ళు ఏకదీక్షతో చదవసాగాడు.

'ఫస్ట్‌క్లాస్ రావాలి. వీలయితే డిస్టింక్షన్ మార్కులు సంపాదించాలి.

రోజు రోజుకీ పరిస్థితులు గడ్డుగా తయారౌతున్న యీ రోజుల్లో నిరుద్యోగ రాక్షసి కబంధ హస్తాలకి తను చిక్క కూడదు.

అందుకు తన కుండగల ఒకే ఒక్క అర్హత — రికమెండేషనూ కాదు — లంచ మివ్వగల్గటమూ కాదు - కేవలం మార్కులు! కేవలం మార్కులే !

అందుకే తను అహరహం కృషిచేయాలి.

మూడేళ్ళ శ్రమ ఫలితం మూడేసి గంటలో దక్కనుంది. జారవిడుచుకోవటమే జరిగితే, జీవితంలో చాలా జారవిడుచుకో వల్సి వస్తుంది. ఆ ఫలితం తనొక్కడిదీ కూడా కాదు— తన తండ్రికీ, తల్లికీ- యింటిల్లిపాదికీ ఆలంబన :

ఆ లక్ష్య సాధనకే అతడు నిద్రాహారాల్ని పణంపెట్టి పోరాడ సాగాడు.

అతనికి తోడుగా నిలిచింది రాధ. అతనికి ఎప్పుడెప్పుడు టిఫిన్‌లు, టీలు కావాలో కని పెట్టుకుని మరీ అడిగి యివ్వసాగింది. రాత్రులుతనుకూడా ఏదో ఒకటి చదువు కుంటూకూర్చునేది దగ్గర్లోనే. ఎంత వారిం చినాఆమెను మానిపించలేక పోయాడు.

ఒకరోజు రాత్రి, అందరూ నిద్రపోయా రని అనుకున్న తరువాత, అడిగాడామెని భాను,

"ఏమయింది రాధా ఆ సంబంధం?"

ఆ ప్రసక్తి ఎదురు చూడనట్టుగా ఉలిక్కిపడింది ఒక్కసారి రాధ. ఆ తరువాత చిన్నగా నవ్వేసి—

"రాలేదసలు!" అంది.

"అదేం?" విస్తుపోయి అడిగాడు భాను.

"నేను వద్దని నాన్నగారితో చెప్పేశాను."

"ఎలా?"

'నేను ముందు గ్రాడ్యుయేట్‌ని కావాలనీ అసలు పోస్టు గ్రాడ్యుయేట్‌ని కూడా కావాల నుందనీ, పెళ్ళి పేరిట నా కోరికకివిఘాతం కలిగించవద్దనీ వేడుకున్నాను!

నాన్నగారికి నా మాటంటే ఎప్పుడూ యిష్టమేగా! 'మా అమ్మాయికి యిప్పట్లో పెళ్లి చెయ్యబోమ'ని వాళ్ళకి లెటర్ రాసి పడేశారుట!"

"ఎందుకలా చేశావ్ రాధా? మంచి సంబంధం... వదులుకోవలసింది కాదు."

"నేను మరికొన్నేళ్ళు ఓపికపడితే అంత కన్న మంచి సంబంధమే నాకోసం కాచుకు నుందని నా భ్రాంతి! ఆ భ్రమ కూడా విడిపోయేదాకా యిలా ఎదురు చూడటమే నా డ్యూటీ!...

అనవసరపు ఆలోచనల్లో యిప్పుడు ఇరుక్కుంటే, టైము వృథా అయిపోతుంది — కానియ్ బావా! చదువుకో!" అనేసి అక్కడినించి లేచి వెళ్లిపోయింది రాధ!

ఆమె పట్టుదలకి ఏమనాలో తెలియక అలా చూస్తూ కూర్చుండి పోయాడు భాను.

## 24

పరీక్షలు వచ్చాయి — దడ దడ లాడే గుండెకి ధైర్యం చెప్పుకుంటూ, ఏ రోజు కారోజు కొత్త ఉత్సాహం పుంజుకుంటూ అన్ని పరీక్షలూ పూర్తి చేశాడు భాను.

చివరిరోజు - ఆ రోజతడి ఆనందం అంతులేకుండా పోయింది. అన్ని సబ్జక్టులూ బాగా రాయగలిగానన్న తృప్తి అతణ్ణి నిలవ నియ్యలేదు.

గంతులేయాలనిపించింది.

శంకర్రావుగారితో సహా యింటిల్లిపాదినీ సినిమాకి తీసుకువెళ్లాడు.

మర్నాటి ఉదయమే ప్రయాణం పెట్టు కున్నాడు గానీ, శంకర్రావుగారు పడనీయ లేదు.

ఆయనకి ఆనందంగా వుంది.

తన కొడుకు పరీక్షలు బాగా రాసిందాని కన్నా ఆనందంగా వుంది.

తన మాట మీద తీసుకు వచ్చాడు భానుని.

ఈ నాటికి తన శ్రమ ఫలించింది.

తన అపోహాలూ, అనుమానాలూ అతడి విషయంలో నిరాధారమయి, తేలిపోయాయి. అందుకే ఆయనకీ ఆనందంగా వుంది.

మర్నాడు ఆదివారం కావటాన ఆయన ఫాక్టరీకి వెళ్లలేదు. ఇంట్లో విందు ఏర్పాటు చేశారు — కుటుంబ సభ్యులకే!

రోజల్లా అందరూ కలిసి కేరమ్స్ ఆడారు పిల్లలతో కలిసి తనూ అల్లరి చేశారు శంకర్రావుగారు.

ఆయన్లో అంత ఉత్సాహం ఎప్పుడూ చూడని భాను చాలా ఆశ్చర్యపోయాడు.

అందరూ సంతోషంగా వున్నా — కౌసల్య కళ్ళలోనూ, రాధ నయనాల్లోనూ కదలాడు తున్న నీలినీడల్ని గమనిస్తూనే వున్నాడు భాను. కానీ — అతనా నీడల్ని తరిమి వెలుగులు నింపేందుకు అశక్తుడు. బాధ పడుతూ వూరుకుండిపోయాడు అందుకే!

## 25

తెల్లని పాల వెలుగు వూరంతా జిలుగు లీనుతున్నవేళ...

అప్పుడే స్టాండులోంచి కదలనున్న బస్ లోకి ఎక్కాడు భానుమూర్తి.

వేసవికాలం కావటాన్న ఆరున్నరకే



## జీవనపోరాటంలో...

సూర్యుడు మబ్బుల్ని తోసుకుని వచ్చే ప్రయత్నంలో కృతకృత్యుడౌతున్నాడు. పూర్తిగా రాకపోవటాన, యింకా వీస్తున్న పిల్లగాలులు చల్లదనాన్ని ప్రజలకి పంచి యిస్తున్నాయి.

"ఉత్తరాలు రాస్తుండు భానూ" అన్నాడు రాజా మళ్ళీ.

"ఓయస్! తప్పకుండా" అన్నాడు భాను ఉత్సాహంగా.

బస్ నెమ్మదిగా కదిలింది. శంకర్రావు గార్ని, కౌసల్యని, రాజుని – చివరికి రాధని దాటుకుంటూ ముందుకు వచ్చింది. 'జీవనది' యిప్పుడు ఎండిపోయి శుభ్రంగా వుంది. దాన్ని దాటుకుంటూ రోడ్డుమీదికి వచ్చింది.

పాలిటెక్నిక్ ఆవరణ నిర్మానుష్యంగా వుంది. దాని ముందునించీ సాగిపోయింది. రైలు గేటుదాటి, ఊరిని పూర్తిగా దాటి, ముందుకి పరుగు అందుకుంది.

కిటికీలోంచి చూస్తూ కూర్చున్నాడు భాను.

'విద్యార్థి దశ ముగిసింది. విజయవంతంగానే ముగిసినట్లు తను భావిస్తున్నాడు. అయితే యీ విజయానికి ముందు ఎన్ని ఒడుదుడుకులు– ఎన్ని అవకతవకలు – ఎన్ని కష్టాలు – ఎలాగయితేనేం అన్నిటినీ తట్టుకుని, మలుపు తిరిగిన బాటలో, సలుపెరుగని పోరాటం సాగించి, చివరికి జయించాడు.

ఇప్పుడు జీవితంలోకి ప్రవేశించబోతున్నాడు.

అంటే మళ్ళీ మరోరకం ఆరాటంలోకి, కష్టాలలోకి –

భగవాన్! నా లక్ష్యసాధనలో తోడ్పడి, నన్ను ముందుకు నడిపించు. ధైర్యాన్నీ, ఉత్సాహాన్నీ, తెగింపునీ కలిగించి విజయవంతంగా గమ్యం చేర్పించు."

కళ్ళు మూసుకుని ఆ అలౌకికశక్తిని, సర్వాంతర్యామిని ప్రార్థించాడు భానుమూర్తి.

(అయిపోయింది)

### అంకితం

చదువుకున్న ప్రతివారి బతుకులోనూ విద్యార్థి జీవితం ఓ మలుపు లాటిది. ఆ మలుపులో నాకెదురైన కొన్ని వాస్తవాలూ + అవసరమయిన కల్పన= ఈ నవల.

చదువు నేర్పిన గురువుల ఋణం తీర్చుకోవటం అసాధ్యమే అయినా, ఓ చిన్న ప్రయత్నంగా, మనిషిగా నేను నిలబడటానికి అజ్ఞాతంగా తోడ్పడిన తణుకు ఎస్.ఎం.వి.ఎన్. పాలిటెక్నిక్ ఉపాధ్యాయ బృందానికీ, ముఖ్యంగా శ్రీ ఎ. కామేశ్వరరావు (సివిల్) మేష్టారికీ ఈ నవల గౌరవపూర్వకంగా అంకితం చేస్తున్నాను.

— రచయిత.

## ఫాలాక్షుని డైరీ

(16వ పేజీ తరువాయి)

పార్టీ తగాదాలో అన్న చెయ్యి నరికిన అనుజుడు!

ఆత్తూరుకు చెందిన 30 ఏళ్ల మోహన్ అన్నా ద్రావిడ మున్నేట్ర కజగం [ఎం. జి.ఆర్. పార్టీ]ట. అతని తమ్ముడు 24 ఏళ్ల సంపత్ కాంగ్రెసు [ఇందిరాపార్టీ]ట. అన్నదమ్ములిద్దరూ నా పార్టీ గొప్పంటే నా పార్టీయే గొప్పని పోట్లాడుకోనారంభించారట. వాదులాటపోట్లాటయి, పోట్లాట తిట్లాట, ఆ తిట్లాట కొట్లాటగా రూపొందిందట. దాంతో సంపత్ మామిడి కాయలు కోసే కత్తితో తన అన్నగారి కుడి చెయ్యి ఒకే దెబ్బలో నరికి పారేసి ఇప్పుడు చెప్పరా ఏ పార్టీ గొప్పదో అనరిచాడట ఆవేశంలో. ఆ ఆవేశం తగ్గేలోగా పోలీసులొచ్చి అతన్నరెస్టు చేసి పట్టుకుపోయారట.

# మేధావులు ఒక వర్గమా ?

వర్తమాన రాజకీయ, సాంఘిక, ఆర్థికాది పరిణామాలకు మంచి చెడులను వస్తు విష్టంగా చర్చించి, కొన్ని అభిప్రాయాలను ప్రజలకు మార్గదర్శక సూత్రాలుగా ప్రకటించగల వ్యక్తిని మేధావి అనవచ్చునని ఒక నిర్వచనం వున్నది ఇలాంటి మేధావులు మన దేశంలో చాలా మంది వున్నారు, ఉంటారు. గతంలో దేశనాయకులందరూ జైళ్ల పాలయి, రాజకీయ కార్యకలాపాలలో ప్రతిష్ఠంభన యేర్పడినప్పుడు సర్‌తేజ్ బహదూర్‌స్ప్రూ వంటి వారు ప్రముఖ పాత్ర వహించి మేధావులనిపించు కున్నారు. అలాగే భూలాభాయ్‌దేశాయ్ కూడా బ్రిటిష్ పాలకులతో దౌత్యం నెరపడం దేశసేవచేశారు. ఇలా యింకా పెక్కుమంది మేధావులను పేర్కొనవచ్చు. ఇక్కడ గమనించవలసిన విషయం యేమిటంటే మన దేశంలో మేధావుల వర్గం అనేది లేదు. మేధావు లయినవారు అసలు ఒక వర్గంగా లేదా తరగతిగా కొన్ని సామ్యలక్ష్యాలు, ఏకైక కార్యక్రమంతో మూకుమ్మడిగా వ్యవహరించే అవకాశంలేదు. అలా దేశంలో యేమి జేమిటో జరుగుతూంటే తమ కేమీ పట్టనట్టు వారు మౌనంగా, చేతులు నలుపుకొంటూ కూర్చుంటారని, వారివి పడకకుర్చీ రాజకీయాలని, వారివి బూర్జువా ఆలోచనలని భావించడం సమంజసంఅనిపించ కొనదు.

## కొందరు గుర్తించే వ్యక్తి

దేశంలోని ఇతర రాజకీయవాదులవలె మేధావి అని అందరూ కాకపోయినా కొందరు గుర్తించే వ్యక్తి, దేశంలో సంభవించే పరిణామాలను గురించి రోడ్లమీద బిగ్గరగా ఉపన్యాసాలు చేయడు. చేయలేడు. కీర్తిశేషులు సర్వేపల్లి రాధాకృష్ణన్ ఉపరాష్ట్రపతి, రాష్ట్రపతి కాకముందు ఎన్నిరాజకీయ ఉపన్యాసాలు చేశారు? అలా అని ఆనాటి రాజకీయ పరిణామాల పట్ల ఆయనకు అసలు అభిప్రాయాలేమీ లేవని అనగలరా? బహిరంగంగా తమ అభిప్రాయాలను ప్రకటించనందున, వీథుల వెంట తిరిగి హడావుడి చేయని కారణాన మేధావులు ఎమర్జన్సీ రోజులలో చేతులు నలుపుకుంటూ కూర్చున్నారనే అభిప్రాయం ఒకటి మేధావులమని అనుకొనేవారిలో కొంతమందికే వున్నట్టు తోచడం విడ్డూరం కాదా?

సరే అప్పుడంటే నియంతృత్వం వుండేది కనుక భావ ప్రకటనకు అవకాశం లేదు కాబట్టి మేధావులఅభిప్రాయాలు ప్రకటితం కాలేదని అనుకొన్నా, మరి ఈనాడయినా దేశంలో జరుగుతున్న రాజకీయ పరిణామాలన్నీ దేశానికి మేలు చేసేవని అనగలమా ? మేధావులందరూ వాటిని గురించి తమ అభిప్రాయాలను ప్రకటించుతున్నారని చెప్పగలమా?

ఆలోచించే శక్తి, అలవాటు ప్రతివ్యక్తికీ వుంటుంది. కాని, ఆలోచనలను ఒక్కొక్క వ్యక్తి ఒక్కొక్క విధంగా ప్రకటితంచేస్తాడు. వ్యక్తిగా ఒక సంఘటన పట్ల తన ప్రతిస్పందనను ప్రకటించడానికి తరగతిగా, వర్గంగా ముఠాగా, వృత్తిచేసే తమ అభిప్రాయాలను ప్రకటించడానికి తేడా వుంటుందని మనస్తత్వ శాస్త్రం చెబుతుంది.

శ్రీ సంజయ్‌గాంధి మీద నేరారోపణలు జరిగినా, శ్రీమతి ఇందిరాగాంధి విదేశాలలో పర్యటించడానికి కేంద్ర ప్రభుత్వం అనుమతి యివ్వకపోయినా, శ్రీ బన్సీలాల్ చేతులకు సంకెళ్ళు తగిలించి న్యాయస్థానానికి తీసుకువచ్చినా, ఆ యా సంఘటనలను గురించి రాజకీయ వాదులు, పత్రికా రచయితలవంటివారు తమ అభిప్రాయాలను ప్రకటించడానికి ఒక శాస్త్రవేత్త, ఒక తత్వవేత్త ఒక రాజకీయ ధురంధరుడు తమ అభిప్రాయాలను ప్రకటించడానికి తేడా వుంటుందని గమనించలేక పోవడం సరయిన ఆలోచనా పద్ధతి కాజాలదు.

మౌనంగా పనిచేసే పద్ధతి ఒకటివున్నది కొంతమంది వ్యక్తులను ఒకచోట చేర్చి తన అభిప్రాయాలను వారికి తెలియజేసి, వారి అభిప్రాయాలను తాను తెలుసుకొనే పద్ధతి వున్నది. ఈ దేశంలో ముఖ్యంగా మన రాష్ట్రంలో 1. ఇలాంటి కార్యకలాపాలు జరిపిస్తున్న మేధావులు పెక్కు మంది వున్నారు. వారు అంత సులభంగా బజారున పడరు. 2. మేధావులు ఒక తరగతి వారు, ఒక వర్గంకారు. 3. ఎప్పుడో దేన్నిగురించో మేధావులు తమ అభిప్రాయాలను నిరసనను ప్రకటించలేదనే కారణాన ఈనాడు వారు ప్రకటించే అభిప్రాయాలను తెగనాడడం వివేకమని అనిపించుకొంటుందా?

వి. యస్. అవధాని






# రామములగకాయతో రకరకాలు!

ఇక మీదట టమాటాలు విరివిగా దొరుకుతాయి. టమాటాలు రక పోషణకి, ఆరోగ్యానికి ఎంతో ఉత్తమమైనవి. చాలా మందికి టమాటాలని పచ్చడిగానో, కూరల్లో కలుపుగానో వాడడమే తెలుసు. కాని వీటితో పలురకాలైన రుచికరమైన వంటలు చేయొచ్చు.




### టమాటాల అన్నం

2 కప్పుల బియ్యము, 9 కప్పుల టమాటా రసం, ¼ కప్ కేరట్ కోరు, 2 పెద్ద ఉల్లిపాయలు, 4 పచ్చిమిరప కాయలు, 2 జాపత్రి ఆకులు, 1 టీస్పూన్ చక్కెర, ½ టీస్పూన్ జీరా, 3 చెంచాల నెయ్యి.

నవనవలాడే ఎర్రని టమాటా పండ్లు 500 గ్రాములు తీసుకొని వాటిని బాగా పిసికి తగినంత నీరుచేర్చి, నాలుగు కప్పుల రసం తీసి, వడకట్టి పెట్టుకోవాలి.

గిన్నెలో మూడు చెంచాల నెయ్యివేసి, అందులో సన్నగ తరిగిన ఉల్లిపాయ ముక్కలు వేసి ఎర్రగ వేయించి, అందులో జాపత్రి ఆకులు, జీరా, కేరెట్‌కోరు వేసి బాగా వేయించి, అందులో కడిగిపెట్టిన బియ్యం. చక్కెర వేసి కలియబెట్టి, ఐదు నిమిషాలనంతరం నాలుగు కప్పుల టమాటా రసంకూడా పోసి కలియబెట్టి మూతపెట్టి, మెతుకు పదును వచ్చేవరకూ ఉడికించాలి.

### టమాటా కూర

6 పెద్ద టమాటాలు, 3 ఎండు మిరపకాయలు, 1 చెంచా ధనియాలు, 2 చెంచాల కొబ్బరికోరు, 2 పచ్చిమిరప కాయలు, 2 వెల్లుల్లి రెబ్బలు, 2 చెంచాల నెయ్యి, 1 పెద్ద ఉల్లిపాయ, 1 టీస్పూన్ ఆవాలు, 1 టీస్పూన్ పసుపు, చిన్నఅల్లం ముక్క, కొద్దిగా కరివేపాకు, తగినంత ఉప్పు.

ఎండు మిరపకాయలు, వెల్లుల్లిరెబ్బలు, ధనియాలు, కొబ్బరికోరు, ఒక చెంచా నెయ్యిలో వేయించి కొద్దిగా నీళ్ళ పల్లి మెత్తగా నూరాలి. మిగిలిన నెయ్యిలో, ఉల్లిపాయ, పచ్చిమిరపకాయలు, అల్లం ముక్కలు, కరివేపాకువేసి వేయించి అందులో నూరి పెట్టుకున్న మసాలా వేసి వేయించి టమాటా ముక్కలు, పసుపు తగినంత ఉప్పువేసి, కొద్దిగా నీళ్ళకూడా పోసి గుజ్జుగా ఉడికించి చపాతీలతోగాని, పూరీలతోగాని వడ్డించాలి.

### టమాటా ఆమ్లెట్

1 టమాటా, 1 కప్ శనగపిండి, 1 ఉల్లిపాయ, 2 పచ్చిమిరపకాయలు, కొద్దిగా అల్లం, కొత్తిమీర, ఉప్పు.

టమాటా, ఉల్లిపాయ, పచ్చిమిరప కాయలు, అల్లం, కొత్తిమీర అతి సన్నని ముక్కలుగా కోసి, శనగపిండిలోవేసి, దానికి తగినంత ఉప్పు నీరూచేర్చి దోసెపిండి మాదిరి కలుపుకొని ఆమ్లెట్లు పోసుకోవాలి.

### టమాటా సూప్

3 పెద్ద టమాటా కాయలు, 2 లవంగాలు, 2 వెల్లుల్లి రెబ్బలు, ½ పెద్ద ఉల్లిపాయ, ½ కప్పు బియ్యం పిండి, ½ కప్పు పాలు, 1 టీస్పూన్ చక్కెర, 1 టీస్పూన్ వెన్న, కొద్దిగా అల్లం, తగినంత ఉప్పు, మిరియాలపొడి,

టమాటాలు, ఉల్లి, వెల్లుల్లి, అల్లం, లవంగాలు, మిరియాలపొడి, ఒక గిన్నెలో వేసి, తగినన్ని నీళ్ళుపోసి, టమాటాలు బాగా మెత్తపడేవరకూ ఉడికించాలి. పప్పురుబ్బుతో దాన్ని బాగా చిదిమి రసాన్ని వడకట్టి చక్కెర కలుపుకొని, ఈ కప్పుడు రసాన్ని ఒక ప్రక్క పెట్టుకోవాలి.

వేరే గిన్నెలో వెన్న కరిగించి దానిలో బియ్యం పిండివేసి బాగా కలుపుతూ కొద్ది కొద్దిగా పాలుకూడావేసి బాగా కలుపుతూ సన్నని సెగమీద పేస్టులా పుడకనివ్వాలి.

వడ్డించేందుకు ఒక్క నిమిషం ముందు ఈ రెంటినీ వేరువేరుగా వేడిచేసి దించి, తరువాత రెంటినీ ఒక గిన్నెలోకి పోసి బాగా కలిపి అందమైన కప్పుల్లోకి పోసి పైన కొద్దిగా క్రీమ్ కూడా వేసి వడ్డిస్తే చూసేందుకు అందంగా, తినేందుకు రుచిగా వంటికి ఆరోగ్యంగా వుంటుంది.




### పచ్చిటమాటాల పచ్చడి

10 పచ్చిటమాటాకాయలు, 6 ఎండు మిరపకాయలు ½ టీస్పూన్ పసుపు, కొద్దిగా ఆవాలు, మెంతులు.

పచ్చిటమాటా కడిగిముక్కలుకొయ్యాలి. ఎండుమిర్చి, మెంతులు వేయించి పొడి చేసుకోవాలి. రెండు చెంచాల నూనెకాచి అందులో ఆవాలువేసి అవి చిటపటలాడేప్పుడు అందులో టమాటా ముక్కలు, పసుపువేసి, ఉడికించి, పొడిచేసి పెట్టుకున్న కారంకూడా కలిపి మరో ఐదు నిమిషాలు ఉడికించి దించాలి. బాగా చల్లారాక పొడిసీసాలోకి తీసుకొని, చపాతీలలో వేసుకొని తింటే బాగుంటుంది.

— ఎస్. కవిత

అనాది కాల ప్రవృత్తముగా సంగీతము పారంపర్యంగా భారతీయ సమాజంతో నిగూఢంగా నేయబడినది. సంస్కృతి తనంతట తనే ఏ విధంగా మిగుల దైవికంగా భాసించునో, అదే విధముగా, భారత దేశంలో, పక్షులు, జంతువులకేగాక, దేవతలు సంగీత వాద్యములతో విడదీయ లేని విధంగా సమ్మిళితమై యున్నారు. స్థితి కారకుడైన చతుర్భుజుడైన మహావిష్ణు, ఒక చేతిలో శంఖమును ధరించి యున్నాడు; కళలకు, విద్యకు మూల విరాట్టైన సరస్వతి వీణ మీటుచున్నది; శ్రీ కృష్ణ భగవానుడు సర్వదా వేణువుతో సాక్షాత్కరించును. ఇక శివుని చేతిలో ఢమరకం.



మహావిష్ణువు చేతిలోని శంఖం ఈ నాటికి కూడా దేవాలయంలో పూజావిధానంలో ఓ భాగం. క్షీరసాగర మథనం లోంచి వెలువడిన పద్నాలుగు ఆభరణములలో ఇది ఒకటి. చివరకు వచ్చింది 'అమృతం' శంఖంలోంచి వచ్చే నాదం 'నాదబ్రహ్మం'గా పరిగణింపబడు చున్నది. దీనికి సారూప్యమైనది 'అనంతసత్వం'.

# దావణగేరే

అనంతమైన నాణ్యతకు మరో పేరు

ది దావణగేరే కాటన్ మిల్స్ లిమిటెడ్ దావణగేరే కర్నాటక 577 002.

షోరూములు:
చిత్రదుర్గా రోడ్, దావణగేరే 577 002
కావేరి భవన్, బెంగళూర్ 560 009.
దాజిబన్ పేట్, హుబ్లి 580 020.

**జలప్రళయం - రాష్ట్రపతి సందర్శనం :**

ఇరవై వేలమందికి పైగా జనాన్ని పొట్ట పెట్టుకొన్న తుఫాను రాక్షసి విలయ తాండవంతో శ్మశానసదృశమై పోయిన కోస్తా ప్రాంతాన్ని

## హైదరాబాద్ నోట్ బుక్

[18వ పేజీ తరువాయి]

రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి నవంబర్ 23, 24 తేదీలలో పర్యవేక్షణ జరిపారు. ఆయన వెంట గవర్నర్ శ్రీమతి శారదాముఖర్జీ వున్నారు.

**రెండు పుస్తకాల ఆవిష్కరణ :**

నవంబర్ మూడవ వారంలో రెండు గ్రంథాలు ఆవిష్కరింపబడినవి. వీటిలో ఒకటి రేపటి మనిషి అనే వచన కవితా సంకలనం. రెండవది ప్రాచీన సాంప్రదాయకమైన మహాకాళీ సుప్రభాతం. మొదటి దానిని రచించిన వారు శ్రీ బి. గౌరీశంకర్ ఆవిష్కరణ సారస్వత పరిషత్తు హాలులో జరిగింది. అంతర్జాతీయ తెలుగు సంస్థ అధ్యక్షులు డాక్టర్ పి. ఎస్. ఆర్. అప్పారావు అధ్యక్షత వహించారు. దేవులపల్లి రామానుజరావు ముఖ్య అతిథిగా పాల్గొని కవితా సంకలనం ఆవిష్కరించారు. డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యం కావ్యపరిచయం చేస్తూ, రచయిత భవిష్యత్తును దర్శిస్తూ అభ్యుదయాన్ని ఆహ్వానిస్తున్నారని కవితా సంకలనంలో ఆవేశం కన్నా ఆర్ద్రతతో కూడిన సామాజిక దృక్పథం కనిపిస్తుందని వివరించారు. రచయిత కృతజ్ఞత తెలిపినతర్వాత ప్రాచ్య కళాశాల ప్రిన్సిపాలు శ్రీ రంగనాథాచార్యులు ధన్యవాదాలు సమర్పించారు.

మహాకాళీ సుప్రభాతం రచయిత శ్రీ నల్లదీగ శ్రీనివాసాచార్యులు. మహబూబ్ కళాశాలలో ఉపాధ్యాయులు. సికింద్రాబాదీ కాళీ భక్తుల కోరిక పై దీనిని రచించారు.

భూ భవతి సితద్యుతి రమ్యకుచ
స్తబకాలసలాలిత సమ్రమతనో,
తరుణాబ్జ లసన్నయనే, భవితే
పరమేశ్వరి కాళి జయోస్తు శివే

ఈ రీతిగా రచన సంగీతానుగుణంగా రమ్యంగా సాగింది. ఆవిష్కరణోత్సవానికి అధ్యక్షత వహించిన శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, ఆవిష్కరించిన శ్రీమతి కప్పగంతుల అన్నపూర్ణమ్మ, వక్తలు శ్రీయుతులు వరాయితం కృష్ణమూర్తి, దమ్మాలపాటి శేష గిరిశర్మ, తిరుమలరామచంద్ర, కొరిడె కనుకమ్మ రచయిత కవితా కమనీయతను, సుప్రభాతం విశిష్టతను, చరిత్రను వివరించారు. పిదప కీర్తిశేషుడు గరిపల్లి నరశింహశ్రేష్ఠి స్మృతి చిహ్నంగా ఈ సుప్రభాతం ప్రచురించిన ఆయన సోదరుడు శ్రీ గరిపల్లి వీరేశం శ్రేష్ఠి సుప్రభాత రచయితను వక్తలను, సుప్రభాతాన్ని వివిధ రాగాలలో పాడిన శ్రీమతి లలితను పట్టు శాలువలతో సన్మానించారు. రచయిత ప్రచురణకర్తను, కీర్తిశేషుని పుత్రులు శ్రీయుతులు కేశవ్, రాజేశ్వర్‌లను సన్మానించారు.

**ఉపశ్రుతి**

నిన్ను డిస్మిస్ చేశాను పో— అన్నాడు ఆఫీసరు. నాకు నీ ఉద్యోగం అక్కరలేదు. ఇదుగో రాజీనామా— అని నేనన్నాను అన్నాడు నా మిత్రుడొకడు. బాగుంది. వెనుకటికి నీబోటి వరుడే. నీకు నా పిల్లను ఇవ్వను పో—అని అంటే, నాకు అక్కరలేదు పో—అని పోట్లాడి వచ్చాడట. అని చలోక్తి విసిరారు మా మాటలు వింటున్న ఒక పెద్దమనిషి.

— తిరుమల రామచంద్ర.



Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

విజయ మాధవి పిక్చర్స్

# ఆత్మీయుడు

ఈస్ట్మన్ కలర్

నిర్మాత: వడ్డే శోభనాద్రి

నిర్వహణ: వడ్డే రమేష్

కథ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: తాతినేని రామారావు




ఆంధ్ర: అన్నపూర్ణ ఫిలింస్
నైజాం: శ్రీ తారకరామ
సీడెడ్: నవభారత్